# పుష్పాంజలి

★


రచయిత

ఉభయ భాషాప్రవీణ (A)

యడ్లపల్లి కుటుంబరావు

తెలుగు పండితుడు

పురపాలక మాధ్యమిక పాఠశాల

తెనాలి


★


ది మోడరన్ పబ్లిషర్సు (రిజిష్టర్డు)

తెనాలి

కాపీరైటు] 1948 [వెల 1-0-0

# పరిచయము

మిత్రులు శ్రీ యడ్లపల్లి కుటుంబరావుగారును నేనును సహాధ్యాయులము. ఇరువురము అవిమంలెయిగని స్నేహమయ జీవితము గడిపితిమి. చిననాటనుండియు, అభినయ సంగీతములు ఈ మిత్రుడు చేయు యత్నము చూచి నేను తలచినట్లె ఉత్తమ భూమికా నిర్వహణము నకృతార్థుడయ్యెనని సంతసించితిని. ఇపుడు గ్రంథకర్త యయ్యెనని నా సంతసమునకు మేరలేదు.

ఈ మిత్రుడు వ్రాసిన కథలు ముచ్చటగనున్నవి. ప్రతిభా సముద్రులగు మహాకవులు కూర్చినకథలను లలితమగు భాషలో, ఉన్నత పాఠశాలలలో జదువు విద్యార్థులకు అనువుగకూర్చిరి ఇవి విద్యార్థులకు కథాభిరుచిని, కథా సంఘటనా శక్తిని కల్గించుననుట నిస్సంశయము.

విద్యాధికారులిట్టి యుత్తమ కథాగ్రంథములకు ప్రోత్సాహమిత్తురని యాశించుచున్నాను.

ఇట్లు,

తెనాలి
29-8-47

కావూరి సుబ్బరామయ్య
అధ్యక్షుడు
కె. యల్. యన్. సంస్కృతకళాశాల, తెనాలి.
ఆంధ్ర విశ్వవిద్యాలయ పాఠ్యనిర్ణాయక
సంఘసభ్యుడు (PASS)
ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యుడు.

# చారుదత్తుడు

## పరిచయము

చిరకాలమునాడు భరతఖండమున ఉజ్జయిని యను నగరము పుణ్యఖండమని ప్రసిద్ధికెక్కెను. "శేషైఃపుణ్యైర్హృతమివ దివఃకాంతి మత్ ఖండమేకం" అని మహాకవి కాళిదాసు కొనియాడియుండెను. సర్వసంపత్సమృద్ధమగు నా పురవరము రాజధానిగ ఎందఱో చక్రవర్తులు ప్రజాపరిపాలన మొనర్చి కీర్తిగాంచిరి. అప్రతిమానమగు భోజుని వదాన్యత, నిస్సీమమగు కళావేత్తృత్వము, నిరవద్యమగు ధర్మదృష్టి అనర్ఘమణి భూషణములై ఉజ్జయిని నజరామర మొనర్చినవి. రత్నఖని; కళానిలయము; ధర్మపేటిక, అని పొగడ బూనినచో ఏండ్లునుం బూండ్లునుం బట్టును; గాని ఎన్నదరముగాదు. సౌందర్యరాశి యని మాత్రము పేర్కొందుము.

ఆ నగరరాజము రాజధానిగ పాలకమహారాజు పరిపాలన మొనరించునాడు బ్రాహ్మణవంశ రత్నమొకండు తన వెలుగు దళుకులచే ఆపురతిలకమును వెలుగజేసెను. సాగరదత్తపుత్రుడగు చారుదత్తుడే ఆరత్నము. ఆ పురజనులు "కిరీటము లేని చక్రవర్తి" అని ఆ మహాశయుని పిల్చు చుండెడివారు. ఆతడు వర్తకమున మితిలేని సంపదల నార్జించెను; గాని సత్యభాషణముల వీడలేదు. ధర్మపథము తొలగలేదు. సద్గుణములును, సంపదయు, కీర్తియు పందెము వైచుకొని పరుగులు వారినవన్న అతిశయోక్తిగాదు. అతిథ్యభ్యాగతులకు నాతని దివ్యసౌధము ధర్మసత్రమయ్యెను. మిత్రులకు, బంధుగులకు స్వగృహమయ్యెను. ఏపరిచారకుడును 'పరిచారకుడను' అను

కొని యెరుగడు. చేయిచాచిన నిరుపేద నిలువెల్ల కనకవర్ష మున దొప్పదోగెను. వేయేల? మరణమురాదని ఆజ్ఞించెను. మృష్ణాము మనదికాదని నెచ్చబెట్టెను. అతని విభవము త్యాగభోగముల ధన్యమయ్యెను. పతివ్రతాతిలకమగు నాతని సహధర్మచారిణి ధూతాంబ సుగుణాలవాల. ప్రతిపదమున నాతని మనోనిశ్చయమునకు ప్రాకుపెట్టినది. చారుదత్తుని సుగుణపుంజ శ్రవణమున నాతనిపై మరులుగొనిన వారవనిత వసంతసేన కామదేవాలయమున నా సౌందర్యరాశి నీక్షించి ఆత్మార్పణమొనర్చినది. ఆ నిర్వ్యాజప్రేమకు అతడు దోసి లొగ్గెను.

## శీలము - విశ్వాసము

"కింకరుడే రాజగు రాజె కింకరుడగున్ కాలానుకూలంబుగన్" అనుసూక్తి ఎట్టిసత్యసమ్మతము. దుర్విధి ఏమి చేయదు ? నిత్యకల్యాణము పచ్చతోరణముగా విలసిల్లిన చారుదత్తుని యనంతసంపద అగుణనిధి నెడబాసెను. దారిద్ర్య దేవత చారుదత్త సౌధమున విహరింప దొడగెను. అయిన నేమి? ఇనుప గజ్జెల గణంగణాలు అధీరచిత్తుని ధైర్యము నిసుమంతయు సడలింప లేకపోయినవి.

ఒకనాటి సెఱసంజవేళ చారుదత్తుడు జప తపము లొనర్చి బల్యన్న దానమున గృహదేవతల నర్చింపబోవుచు 'అహా! ఏమివిధివైపరీత్యము. కలిమికలనాడు రాయంచలు భుజించు బల్యన్నము నేడు క్రిమికీటములు భుజింప వలసి వచ్చెగా!' అని తన దుఃస్థితికి వగచుచుండెను. అపుడు "చలి కాడా! ఇదిగో జాజిపువ్వుల తావులు వెదజల్లు వలిపింపు

టుత్తరీయము. మీకిమ్మని చూర్ణవృద్ధు డొసగినాడు" అని మైత్రేయుడందింప గుమగుమలు గుబుల్కొను నుత్తరీయ మందుకొని చారుదత్తు డిట్లు చింతించెను. "దారిద్ర్యమున కంటె మరణించుటమేలు. బ్రదికిచెడుట దుర్భరము. అయ్యో! బంధుమిత్రుల దర్శనము కఱవయ్యెనే? అతిథుల నర్చించు భాగ్యము తొలగిపోయెనే! బుద్బుదప్రాయమగు భాగ్యము నకు వగవను. ప్రేమాస్పదులగు మిత్రులసందర్శనము దుర్లభ మగుటకు వాపోయెదను. దారిద్ర్యమా! పంచమహాపాతక ములకు నీవుకూడ తోడునీడవా?". ఇట్లు చింతించి "మిత్రమా! మైత్రేయా! వీథిలో మాతృకలకు బలివేసిరమ్ము" అని సేవక చెలికానికి ఆజ్ఞ యిడి యోగధారణ మొనర్చెను.

ఆ చీకటిరేయి వసంతసేన చారుదత్తుని దర్శింప నరు దెంచుచు రాజశ్యాలకుడగు శకారుని కంటబడెను. కామ మదాంధుడగు నాతుంటరి భయార్తయగు నా సుగాత్రిని వెన్నాడుచు "ఈ గర్భదాసి రాజశ్యాలకుడగు నన్ను వదలి ఈ యెడమచేతివైపుననున్న పాడుపడ్డ యింటిలో నివసించు దరిద్ర చారుదత్తుని వలచినది చూడు" మని స్నేహితునితో వదరెను. ఆ పల్కులు విని వసంతసేన హర్షాబ్ధి నోలలాడెను. "అమ్మయ్యా! బ్రదికితిని. ఈ దుర్మార్గుడు అపకారము చేయ బోయి యుపకారమునే చేసినాడు. ఇక చారుదత్తునంకనుండ నాకేటి భయము" అనిధైర్యము చిక్కబట్టి చేతులతో గడ వుచు ద్వారాన్వేషణ మొనర్చుచుండెను. ఆ సమయముననే మైత్రేయుడు రదనికతోగలసి బలిహరణమునకు ద్వారదేశము చేరెను. వసంతసేన ఒరు లెరుగకుండుటకు చీరచెఱగున దీపము మలిపి అభ్యంతరమున కేగినంత 'రదనికా నీవెచట

టనే యుండుము. ఈ రండా పుత్త్రుడు వాయువు దీపమార్పి నాడు. దీపము వెలిగించి తెత్తు" నని పల్కి మైత్రేయుడు దీపము తెచ్చునంతలో శకారుడు వసంతసేనా భ్రమమున రదనికను పట్టుకొనియెను.

రదనిక యాదుర్మార్గుని భల్లూకపు పట్టువిడుపించుకొన జాలక "మైత్రేయా! ఈ పిశాచము బారినుండి నన్ను రక్షింపు మని" మొరపెట్టెను. అంత మైత్రేయుడు చారుదత్తుని దౌర్భాగ్యమువలెనే వంకర టింకరగనున్న దుడ్డుకఱ్ఱను చేతబట్టి "ఎవడురా! ఆతుంటరి మాయింటనే మమ్ము పరిభవింప జూచుటా? ఇదిగో దండప్రయోగమున యమపురమున కతిథి వగుదువు జుమా!" అని కేకలు వైచుచు శకారుని చూచి "ఓరీ పశువా! దారిద్ర్యమ్ము పైకొన్నను దిగంతవిశ్రాంతకీర్తియగు చారుదత్తు నింటికడనే నీదౌష్ట్యము. జాగ్రత" అని యదలించెను. ఈయదలింపులు దున్నపోతుపై వర్షముకాగా "ఓరీ మైత్రేయా! నీదంభములు కట్టిపెట్టుము. నామేడపై హంసతూలికా తల్పమున శయనించిన ఆర్య శకారుని సరసకు వసంతసేనను స్వయముగా చేర్పవలయు ననియు, కాకున్న కాగలదానికి సిద్ధముగా నుండు మనియు నీ మిత్రునితో నామాటలుగా చెప్పుము" అని పల్కి శకారుడు మిత్ర సహితుడై మరలిపోయెను.

ఆసమయముననే యోగమగ్నుడగు చారుదత్తుడు కనువిచ్చి కనుచీకటిలోనున్న వసంతసేనను రదనికగా తలచి "రదనికా! ఈయుత్తరీయము కన్నతండ్రికి కప్పి చలిగాలి సోకకుండ లోనికి గొనిపొమ్ము" అని యాజ్ఞాపింప సంశయగ్రస్త యగు వసంతసేన మిన్నకుండెను. "ఆహా! దారిద్ర్యమా! నీప్రాబల్య మనంతము. దురదృష్టవంతుడగు నీ చారుదత్తుని

యనంతరము నీ యధికార మంతరించునుకాబోలు'' అని పలుకుచుండ రదనికామైత్రేయు లరుదెంచిరి. చారుదత్తుడపుడు వసంతసేనను గుర్తించి "ఆహా! ఏమి ఈమె వలపు. విభవవిస్తర నాశనమున పురుషుని కోపమువలె వ్యర్థముగదా'' అని తలచి "వసంతసేనా! క్షమింపుము. పరిచారికాభావమున పలికిన పలుకులు మంతవ్యములుసుమా!'' అని ప్రతిమాలెను. అంత వసంతసేన "ఆర్య! తమయాజ్ఞ యీదాసికి భూషణము. దుర్మార్గులు నన్ను వెన్నాడు చున్నారు. సువర్ణ భాండమును నీ భూషణమును రక్షింపజాలను. తమయొద్ద దాచియుంచుడు'' అని పల్కెను. "వసంతసేనా! ఈజీర్ణగృహము కట్టియమూల్య భూషణములు దాపజాలునా?'' అని చారుదత్తుడు నిరాకరింప "మహాత్మా! గృహమును జూచికాదు అమూల్యాభరణముల నిక్షేపించుట; సత్పురుషుల ధీరచిత్తములజూచి'' అని వసంతసేన నిర్బంధించెను. నిరుత్తరుడగు చారుదత్తుడు సువర్ణభాండమును గ్రహించి "మైత్రేయా! నిశాసమయముల నీవును, పగలు వర్ధమానుడును ఈ పరార్థ్యభూషణమును రక్షింపవలయు'' నని మైత్రేయు నాజ్ఞాపించెను.

ఒకనాడు సంవాహకుడను జూదరి ద్యూతగృహమున జూదమాడి పదివరా లోడి పోయెను, చావడి గుత్తయైన తీర్ప లేదు. ద్యూత గృహాధికారియు, జూదగాడును వెంబడింప పాఱి పాడుదేవాలయము నందలి పీఠముపై విగ్రహము వలె కూర్చుండెను. వారిద్దరు ఆలయాభ్యంతరముచేరి సంవాహకుని గుర్తించిరి. అతనిని ద్యూతకృత్యమున కీడ్వదలచి పాచికలువైచి "పందెమునాది,నాది 'యని కృత్రిమ కలహము నెఱప సాగిరి. పాచికలు చూచినంతనే సంవాహకు హృదయమును

వెఱ్ఱియావేశ మాక్రమించెను. ఎన్నఁడును జూదమాడనని పెట్టుకొన్న యొట్టు నేటగలిసెను. "పొమ్ము పోయిన జూదగాండ్రకు పాచికల శబ్దము చెప్పఁబడినంత మనసు నిల్వద" ని పలుకుచు "పందెము మీఁదికాసు; నాది, నాది" అని అఱచుచు రంగమధ్యమున ప్రవేశించెను. 'దొఱకినాఁడు దొంగ దొరికినాఁడు' అని పలుకుచు వారిర్వురు నాతని బట్టుకొని "ఓరీ! మాసొమ్ము గ్రక్కుము" అని నిర్బంధింప జొచ్చిరి. "అయ్యలారా! ఆగుఁడు. తీర్చెదను. అబ్బా! పాడువికారము" అని పల్కి మూల్గుచు, వికారము నభినయించుచు సంవాహకుఁడు క్రిందఁగూలెను. "ఓరీ! ఈ టక్కులు మాకడనా? పూటకలదేని విడచెదము. లేకున్న నిన్నమ్మి మాధనము మేము కొందుము" అని పల్కి ఆతనిని నడివీధికీడ్చిరి. "అయ్యలారా! "ఇల్లలకినంతనే పండుగు కాలేదు. ఇట్టిపాట్లు జూదరు లందరకు వచ్చును లెండు. పౌరులారా! పది వరాలిచ్చి నన్ను విలుచుకొండు. కాళ్ళు పిసుక గలను. అభ్యంగన మాడింపగలను. అయ్యో! ఎవ్వరును మాటాడరేమి? మాచారుదత్తుని విభవ మంతరించినంతనే మాకిట్టి దుర్దశ సంభవించినది" అని సంవాహకుఁడు వాపోవ దొడఁగెను. "మా పందెము ధనము మాటయేమి?" అని వారాతనిని కొట్టసాగిరి.

ఆసమయముననే దర్దురుఁడను జూదరి ఆవీధినే వచ్చుచు "అయ్యో! పూర్వము వీరికి నేనప్పుపడియుంటినే. నేనుదిరిగి పోవుటకు వీలులేదు. ఉత్తరీయముచాటు చేసుకొందమన్న ఇది యంతయు చిరుగుల గంత. ఏమిచేయుదును." అని పరిపరివిధముల తలపోసి పోసి, ఎట్టకేలకు వారిని సమీపించి "అయ్యలారా! ఏలవానిని కొట్టెదరు. ర్ధకల్యవర్త్తము పాటిచేయని

పదివరాలకా యాతని నట్లుబాధించుట'' యని గంభీరముగా పల్కెను. "సరిసరి. మాకాపదివరాలే పదివేలు'' అని ఈస డించి "మాధనము మాటయేమి''అని సంవాహకుని ముక్కుపై రక్తముకారునట్లు గ్రుద్దిరి. మూర్ఛిల్లినట్లు క్రిందికొరగిన సంవా హకుడు దర్దురుని సంజ్ఞ గుర్తించి ద్యూతసభికుల కండ్లలో ఇసుముచల్లి పారిపోయెను.

ఇట్టుకొంత దవ్వరిగి వసంతసేనయిల్లు జొచ్చెను. ఆసమయమున నామె చెలి మదనికతో ముచ్చటలాడు చుండెను.

మద:— అమ్మా! నిర్భాగ్య చారుదత్తునిపై మమకారమేల ? ఇట్టి తగులము తగునా ?

వసం:— చెలీ ! అట్లందువేలనే ? వెలయాలు; ఎంత నీచము. నిర్భాగ్యుల జేరినపుడుగదా వెలయాలు పదార్థ మపార్థమగునది. కలిమిలేములు శాశ్వతములే ?

మద:— చాలుచాలు. సంతోషము, సువర్ణభాండము ఆ దరి ద్రుని భాగ్యవంతు నొనర్చునులే!

ఇట్లు సరససల్లాపములు జరుగుచుండ సంవాహకుడు వసంతసేన పాదములంటి "అమ్మా! రక్షింపుము. ఆర్య చారు దత్తుని సేవకుడను. అభ్యంగనాదిక్రియల నాయుదారునిమెప్పు గొంటిని. మాదౌర్భాగ్యమున నామహనీయుని సంపద యుడి పోయినది. తెక్కలులేని పక్షులమైతిమి. ఎచ్చటను పరపతిలేని యీనిర్ధనుడు ద్యూతసభికుడై పదివరాలోటుపడెను. అరుగో ! వారు తరుముకొని వచ్చుచున్నారు. రక్షింపవా తల్లీ!'' అని ప్రార్థించెను.

చారుదత్తనామ శ్రవణమున వసంతసేన యొడలు పులకితమయ్యెను. మనసు వివశమయ్యెను. "తమకాశ్రయమగు వృక్షరాజము పెనువాతము వాతజిక్కినంత నలుగడల బాఱు తిర్యక్కులవలె నా ప్రాణప్రియుని సేవకులు ఎట్లుండిరి" అని విచారించుచు వసంతసేన అతని పీఠముపై గూర్చుండబెట్టి మదనికను తలుపు బంధింప నియోగించెను. రక్తచ్ఛాయల వెంట సంవాహకు నన్వేషించుచు వచ్చిన యా జూదరులకు పది వరాలిచ్చి పంపివేసెను. దీనిని గనిన సంవాహకుని హృదయమున సంతసము ముమ్మర మయ్యెను. అతని చిత్తవృత్తి సన్మార్గమున నడుగిడెను. పశ్చాత్తాపమున నాతడు నిలువెల క్రుంగిపోయెను. "తల్లీ! సుగుణప్రభావము నాయుల్లము కైవసమొనర్చుకొనినది. మా యార్య చారుదత్తుని సుగుణరాజములు దురంతమగు నాయాపద బోకార్చినవి. హేయమగు నీ ద్యూతక్రియకు తిలాంజలు లిచ్చితిని. ఇక శాక్య శ్రామణకుడను బౌద్ధసన్యాసి నయ్యెదను. కట్టెలమ్మిన యూరనే పూలనమ్మెదను జూడుము. ఇందుకు దైవముసాక్షి. అమ్మరో! ఈ సంవాహకుని మరువకుము. అనుజ్ఞయిమ్ము" అని విన్నవించి వసంతసేనను వీడ్కొనెను.

సంవాహకు డిట్లు వసంతసేనను వీడ్కొని సన్యాసివేషమున రాజవీథిని పురోగమించుచుండ మదభ్రాంతమగు ఖుంటమోడకమను వసంతసేన గంధగజము ఆలానమూడ బెఱికి శరవేగమున నరుదెంచి శాక్యశ్రమణకుని పట్టుకొనియెను. "చచ్చె; చచ్చె" ననుకేకలువిని వసంతసేనా పరిచారకుడగు కర్ణపూరకుడు మత్తగజముమదమడంచి యా పరివ్రాజకు రక్షించెను. అతనిసాహసమునకు ఆశ్రోవనె పోవుచున్న చారు

దత్తుడు ముగ్ధుడై ఒడలెల్ల తడవుకొని ఏమియుగానరాక జాజి
పువ్వుల తావులు గుబుల్కొను వలిపంపు టుత్తరీయమును వాని
తోషికము నొసంగెను. కర్ణపూరకు డాపారితోషికము గ్రహించి
వసంతసేనా సన్నిధానమున తన్నుకానిపించుకొని [illegible]
వృత్తాంతము విన్నవించి "తల్లీ! నాసాహసమును మెచ్చుకొని [illegible]
మహనీయు డీ జిలుగుచీనాంబర మొసంగెను. [illegible]
దీనిదాల్పనర్హులు" అని యాదువ్వలువ యామెకొసంగెను.
వసంతసేన చారుదత్తుని యానవాలుచూచి [illegible]
సువర్ణాభరణమును దిగిచి యాతనికి పరిదానమిచ్చెను.

# చౌర్యము

చారుదత్తుడు మైత్రేయసహితుడై రేభిలుని సంగీతమున
చెవులకు విందొనర్చి శశాంకుడు పశ్చిమాంబుధి గ్రుంకు [illegible]
యమున గానప్రశంశచేయుచు గృహమున కరుదెంచెను.
సువర్ణభాండమును ప్రాణపదముగ రక్షించుచున్న వర్ధమానకుం డా
"ఆర్యమైత్రేయ! బ్రతికితిని. ఇదిగో సువర్ణభాండము" అని
ఆ అమూల్యాభరణమును మైత్రేయున కొసంగెను.

ఆనాటి నడిరేయి శర్విలకుడు [illegible]
మదనికా పరిగ్రహణమునకై చౌర్యమున [illegible]
బయలుదేరెను. దీపమార్పుపురుగును మొలను [illegible]
చ్ఛేదము చేయునపుడు పరవీక్షణములు సోకవనియు, [illegible]
గ్రుచ్చుకొనవనియు చెప్పి యోగాచార్యు [illegible]
[illegible] ఒడలికి పూసికొనుటకు భద్రపఱచెను. [illegible]
చేతబట్టెను. కొంతదవ్వరిగి శర్విలకుడు ([illegible])

ఆహా! ఘనపటల తమోనిరుద్ధ తారమగు నీరజని తల్లి వంటిది గదా! వృక్షవాటికా పరిసరమున సంధినొనర్చి లోన ప్రవేశించితిని. కొందఱు దీనిని నీచమని దూఱెదరుగాక. పరదాస్యము కన్న స్వతంత్ర జీవనమేమేలని నేనుతలచెదను. ఇది మోసమనుట కల్ల. సౌప్తిక వధమున ద్రౌణి యీమార్గమునే చేబట్టెను. ఈ చతుశ్శాలకమున సంధిచ్ఛేద మెచ్చట నొనరింపను? శాస్త్రమేమను చున్నది? (ఆలోచించి) ఊ! సరి. జలావసేక శిథిలము; నిస్త్రీకము; త్వఱనుశబ్దమొనర్పనిది; చవుడు దుల్లునది; ఇటుకలు కదలునది కావలయునా? పరిశీలింతును. ఆహా! శ్రమఫలించినది. శాస్త్రలక్షణములు సరిపోవుచేకాదు; మూషికోత్కర మిటునటు తండోపతండముగ గంతులువైచు చున్నది. ఆచార్యులగు కనకశక్తిఏమనెను? 'పండుటిటుకలున్న పెకలింపుము. పచ్చివైన విరుగగొట్టుము. మట్టిముద్దలైన నాన్పుము. బల్లకూర్పైన కోయుము' అనిగదా సెలవిచ్చి యున్నారు. ఇట పక్వేష్టకముల పెకలింప వలయును. బాలచంద్రునివలె, సూర్యుని భంగి, అబ్జముపోలిక, పూర్ణకుంభము నట్లు కన్నము చతుర్విధముగదా. ఇందు నా చాతుర్యము చూపెదను. నా నేర్పుచూచి నా గురువులే తెల్లవోదురు. గృహాధికారులు పోయిన సొమ్ముకేడ్వక అస్మత్సంధి విచ్ఛేదనా చాతుర్యమును జూచి ఆనందపరవశులై మెచ్చిన సంఘటన లెన్నియేని కలవు. కుమారా కార్తికేయ! నమోవాకములు యోగాచార్య గురువర్యా! భవత్ప్రథమ శిష్యుడు నమస్కృతము లర్పించు చున్నాడు. అయ్యో! ఎంత మందమతిని. ప్రమాణసూత్రము మఱచితినే. కలదుగదా యజ్ఞోపవీతము. బ్రాహ్మణునకు అందునను నావంటివానికి మిక్కిలి ఇది యుపక

రించును. దీనితో కన్నము కొలుతును. పాము కఱచెనా? కట్టుకట్టుకొనెదను. ఆభరణముల సీలలు త్రిప్పెదను. ఉలికలత్తెదను. నిండు కుండవలె కన్నము త్రవ్వెదను; (త్రవ్వి) సంధి ఏకలో ష్టావశేషముగ నున్నది. అబ్బా! పాము పాము కఱచినదే; జందెముచే కట్టుకట్టెదను. అమ్మా! బాధ తగ్గినది. (త్రవ్వి) కన్నము సిద్ధమైనది. అరెరే! లోన దీపమున్నది. అయిననేమి? ఇద్దరే నిదురించు చున్నారు. ద్వారము తెరతును. శిథిల గృహమగుటచే కవాటము కిఱ్ఱుమనును. జలసేచన మొనర్చి తలుపు తెఱతును. (తెఱచి) వీరిది దొంగనిదుర కాదుగదా! శ్వాసము లొక్కమాఱు వెడలుచున్నవి. కనుఱెప్పలు మూసుపడి నడుమ నడుమ కదలకున్నవి. కాలుసేతులు పొడవుగా వ్రేలియున్నవి. ఇది గాఢనిద్రయే. అన్వేషణ మొనర్తును. ఇది మృదంగము. ఇది పణవము. ఇది వీణ. ఇది పిల్లనగ్రోవి. ఇవి పొత్తములు. ఇది నాట్యాచార్యుని గృహమాయేమి? అయ్యో! దివ్యభవనమని చొచ్చితినే. అగర్భ దరిద్రుని గృహమైనది. ద్రవ్యముభూస్థాపిత మొనర్చెనేమో? విత్తునాటి చూచెదను. (నాటి) అయ్యో! పచ్చిక పట్టలేదు. రిక్తహస్తములతో తిరిగి పోవలసినదే. (పోబోవును)

అంతట ఆ నిద్రించు నిద్దురలో విదూషకుడు "ఆర్య! కన్నమువలె కన్పడు చున్నది. దొంగవలె నున్నాడు. నీ యాభరణము నీవే పుచ్చుకొమ్ము" అని కలవరింప దొడగెను. దీనినివిన్న శర్విలకుడు "ఏమీ! వీడు నన్ను వెక్కిరించు చున్నాడా? నిజముగ సువర్ణభాండము గలదా? పరిశీలింతును. (పరిశీలించి) ఆ! జర్జర స్నానశాటీ నిబద్ధమగు సువర

ఖాంకనుడగో. వీనిని వధించి దొంగిలింతునా? తగదు కులప్రాగల్భ్యమున్న యీ బ్రాహ్మణుని చంపరాదు. ఇవి పలవరింతును, పోయెదను" అని పోబోవుచు "మిత్రుడా! గ్రహింపకున్న గోబ్రాహ్మణ హత్య యొనర్చినట్లు" అని మైత్రేయుడు [illegible] విని "గ్రహింపక తప్పదు. దీపపువెలుగున నన్ను గుర్తింపగలండన భద్రపీఠపు పురుగును పంపి దీపమార్పింతును" అని దీపమునార్పు పురుగును పంపి దీపమార్పెను. "ఛీ ఛీ ఎంతపని చేసితిని. దీపము నార్పి యీ యింటిని, అపయశముల్లించి బ్రాహ్మణవంశమును అంధకారబంధుర మొనర్చితిని. చతుర్వేదవేత్తయు, అప్రతిగ్రాహకుడు నగు బ్రాహ్మణా పతంగునికి జన్మించి గణికయగు మదనికపై చేయి చాచుచుంటిని" అని చింతించి సువర్ణభాండమునకై నీటిచే చల్లనైన చేయి చాచెను. "మిత్రుడా! నీ చేయి చల్లగానున్న దేమి?" అని మైత్రేయుడడుగ "అయ్యో! ప్రమాదము. ఈచల్లని చేతిని చంకలో పెట్టెదను" అని వెచ్చచేసి ఆభరణము గ్రహించెను. "గ్రహించితివా" అని మైత్రేయుడడుగ "బ్రాహ్మణ ప్రణయ మానిని క్రమణీయముగాన" అని శర్విలకుడు పలికెను. "సరుకులన్నియును సముద్రముపోయిన వర్తకునివలె సుఖముగా నిదరింతును" ని మైత్రేయుడు పలుక "మహాబ్రాహ్మణ! వరశతము నిద్రించుము" అని శకారుకు మైత్రేయునితో పలికి "అయ్యో! బ్రాహ్మణహత్య యొనర్చితిని! పేదటికము కర్చ్యా [illegible] సంగజయును. దుష్కార్యముచేయనే చేసితిని. [illegible] మదనికను దాస్యముక్తనొనర్చి మన్మథ సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడ నయ్యెదను. పదశబ్దము వినబడుచున్నదే [illegible] జాగరూక! ఆ! నాకు గూడ రక్షకభటుల

భయమా. పిల్లివలె నడతును. లేడివలె పరుగెత్తెదను. పాము వలె ప్రాకగలను, మారువేషములు వేయగలను. భూమిపై గుఱ్ఱమును, నీటిలో ఓడను అగుదును" అని పల్కుచు మన నికకై పరుగువారెను.

రదనిక మేల్కని సంధిచ్ఛేదము చూచి మైత్రేయుని మేలుకొల్పెను. మైత్రేయుడు త్రుళ్ళిపడి "మిత్రమా! చారు దత్త! లెమ్ము లెమ్ము. దొంగలుపడిరి." అని మిత్రుని ప్రబోధించెను. అందఱు కన్నమునొద్ద గుంపుగూడిరి. చారుదత్తుడా కన్నముచూచి "ఈచాతుర్యము నెంతని మెచ్చుకొందును. చిన్నతల, పెద్దకడుపు గలదొంగ ఇందు జొచ్చియుండును. ఇంత నిపుణత్వమెట్లబ్బి యుండును." అని అచ్చెరువందు చుండెను. విదూషకుడు "మిత్రుడా! పొరుగూరివాడో, శిక్షితు కాముడో కన్నము వేసియుండును. ఉజ్జయినిలో మన విభవ మెరుగనివా డెవ్వడు?" అని పలుక చారుదత్తుడు "కన్నగాడెవ్వడైననేమి? నా యిల్లు మెట్టినవాడెవ్వడును రిక్తహస్తుడై చనుట ఎఱుగను. నేడీ దొంగ శ్రమకు ఫల మబ్బ లేదని విచారించునుగదా" అని తలచి విచారనిమగ్నుడయ్యెను.

విదూషకుడు "ఏలనయ్యా విచారము. ! సువర్ణ భాండమో రత్న భాండమో దొరకునని దొంగ యిందు దూరినాడు. మైత్రేయుడు మూర్ఖుడని నన్ను మాఱుచుందువు. సువర్ణభాండాభరణమును ఒట్టుపెట్టి నీ కప్పగించి చోరుని బాధ తప్పించుకొంటెని చూడుమ"ని పలికినంత చారుదత్తుడు "పరిహాసమునకు సమయము లేదా" అని మందలించెను. "వయస్యా! ఇది పరిహాసము కాదు. నీచేయి చల్లగా నున్న దేమి? అని పల్కి నీ కాభరణ మీయ లేదా" అని

విదూషకుడు పలుక "మైత్రేయా! ప్రియము, ప్రియము. చోరుడు సంతోషముతో మరలి పోయెను. గాన నా హృదయ మానందమగ్న మయ్యెను. బెంగతీరెను" అని చారుదత్తుడు పరవశుడై పల్కెను. "అది న్యాసమ"ని మైత్రేయుడు పల్కి నంతనే చారుదత్తుడు మూర్ఛాగతుడై తెప్పరిల్లి "జరిగినదాని నెవ్వడు విశ్వసించును? లోకము నన్ను నిందించును. దారిద్ర్యము శంకనీయముగదా. ఇంతదనుక నా యదృష్టము ద్రవ్యమునందే యుండెను. ఇప్పుడు చారిత్రమున గూడ జేరినది" అని విచారించు చుండ "న్యాసముంచిన సాక్షి యెవ్వడు?" అనిమైత్రేయుడు పల్కెను. "మైత్రేయా! అసత్య మాడు మందువా? బిచ్చ మెత్తియైన న్యాసము తీర్చెదను. చరిత్రకు కళంక మాపాదించు నసత్య మాడను." అని పల్కి అందఱు గూడి గృహాభ్యంతరమున కేగెను.

చారుదత్తుని ధర్మపత్ని యీ వృత్తాంతము సర్వము దూతికాముఖమున విని డొల్లవోయి యెట్టకేలకు దేఱుకొని "చేటీ! ఆర్యపుత్త్రుని చారిత్రమునకు ఎట్టిమచ్చ వాటిల్లెను. గ్రుడ్డిలోకము దారిద్ర్యమున ఆర్యపుత్రుడు ఘటికార్య మొనర్చె నని తలచును గాబోలు. ఔరా! దారిద్ర్యమహిమ! పురుషుల భాగ్యమును నలినీదళజలకణముం జేసి క్రీడించు చున్నది. నా పుట్టినింటివా రిచ్చిన రత్నావళి యున్నది. ఆర్యపుత్త్రులు దీనిని గైకొనరు. మైత్రేయుని పిలువుము" అని మైత్రేయుని పిలువనంపి రత్నషష్ఠీవ్రతము పేర అతనికి రత్నావళి దాన మిచ్చెను. మైత్రేయుడు ఔరా! ఏమి యీమె మహనీయత" అని వెఱగందుచు, తనకై నిరీక్షించుచున్న చారుదత్తుని కలియబోయి "వయస్యా! దీనిని గ్రహింపుము. సదృశదార

సంగ్రహమున కిది ఫలము సుమా" అని సంతోషముతో పల్కెను. "వయస్యా! శ్రీధనము దిక్కుగా గల నేను ఇపుడు నిజముగా దరిద్రుడను" అని కొంత చింతించి "కాను కాను. అట్టి భార్యయు, నీ వంటి మిత్రుడును కలుగ నే నెట్లు దరిద్రుడను. వయస్యా! వసంతసేనా గృహమునకు బోయి "మీరు నిక్షేప ముంచిన సువర్ణ భాండమును ద్యూతమున ఓడిపోతిని. ప్రత్యామ్నాయముగ ఈ రత్నావళి గ్రహింపుడు" అని మన్ముఖమున చారుదత్తుడు కబురంపె నని పల్కుము" అని ఆజ్ఞాపింప "అభుక్తము, అల్పమూల్యము, చోరాపహృతము నగు దానికి చతుస్సముద్రసారభూత మగు నీ రత్నావళి నర్పించుట" యని మైత్రేయుడు సంశయించుచుండ "మైత్రేయా! అట్లు తలపకుము. మనకడ ఏ నమ్మకమున నామె నిక్షేపించినదో దానికి తగినట్లు మసల వలదా? మారు మాటాడక పోయి రమ్ము" అని మైత్రేయు నంపి "వర్ధమానక! కన్నము వెనువెంటనే ఇష్టకములచే పూడ్పించుము. చౌర్యము జరిగినట్లు వెల్లడి కారాదు. అదరిద్రుడ నగు నేనును శుచినై సంధ్యోపాసన మొనర్ప నేగెదను" అని చారుదత్తుడు పల్కెను.

## మదనికా శర్విలకము

వసంత:—మదనికా! ఈ చిత్రముచూడుము. ఆర్యచారుదత్తుని యీచిత్రాకృతి సుసదృశముగ లేదా?

మదనిక:—సదృశముగనే యున్నది.

వసంత:—ఎట్లు తెలిసికొంటివి.

మదనిక:-నీదృష్టి ఇందు లగ్నమైయునదిగా.

వసంత:- వేశవాస దాక్షిణ్యముచేతనా ఇట్లుపలుకు చున్నావు.

మదనిక:- విజనాశ్రయ మగువేశమున ప్రవేశించువాడు అలీకదక్షిణుడు.

వసంత:- నానాపురుషసంగముచే వేశ్యాజనము జలీకదక్షిణము.

ఇట్లు చెలు లిర్వురు సరసస్లాపనిమగ్నత నుండ "అమ్మా! మదివేలబంగారము, గవుసెనబండియు శకారుడు గారు పంపిరని అమ్మగారు విన్నవింపు మనిరి" అని చేటి యొకతె విన్నవించెను. ఈవార్తకు నాసారంధ్రము లదర, అధరపల్లవముచలింప 'ఓసీ! నేనుబ్రతికియుండుట ఇష్టమైనచో మఱల ఇట్టి కబురంపవలదని మాయమ్మతో చెప్పు'మని రూక్షాక్షరముల చేటితో పలికి చారుదత్తచిత్రదత్త దృష్టియై చెదిరిన మనోవృత్తి కూరట కల్గించుచుండెను.

ఆ సమయమున "ప్రాణప్రియ యగు మదనికకై ధనార్థినయి ఒకయిల్లు చొచ్చి పరిచారికా సంభాషణము విని పరుగెత్తవలసి వచ్చెను. మఱొక్కయిల్లు స్త్రీజనబహుళ మగుటచే చొరరాని దయ్యెను. తుదకెట్లో యీనగ చేత జిక్కినది. మదనిక సెట్లు గాంతునని తలపోయుచు శర్విలకుడు వసంతసేనా సౌధసమీపమున నట్టాడుచుండెను. వసంతసేన 'మదనికా! ఈచిత్రమును శయనాగారమున నుంచి తాళవృంతమును గొనితెమ్మ'ని యాజ్ఞాపించుటచే ఆజ్ఞానిర్వహణమునకు గడంగిన మదనిక శర్విలకుని గాంచి ప్రేమాంకురములు వనలొత్త 'శర్విలక! స్వాగత' మని పల్కెను. శర్విలకుడు మదనికను గాంచి 'అనంగవహ్నితప్తమగు నాహృదయమును

చందన శీతల మొనరించుచున్న ప్రాణాధిక యీ మదనిక రెండవరతి' యని యేమియోపలుక బోయెను. 'ఏమీ! మదనిక జాగుచేయుచున్నది' అని తలచి వసంతసేన గవాక్షమునుండి తొంగిచూచి ప్రేయసీ ప్రియుల సంభాషణమున కంతరాయముగల్గింపక వినదొడగెను.

మదనిక:- శర్విలకా! ఏమియో పలుకబోయితివి. పలుక వేమి?

శర్విలకుడు:- (ఇటునటు పారజూచి) కొంచెము రహస్యము చెప్పవలయును. ఇది వివిక్తమే?

మదనిక :- అగును

శర్విలకుడు:- వసంతసేన నిన్ను వెలకు విడుచునా?

మదనిక:- శర్విలక! ఒకపరి వసంతసేన "నాకు స్వాతంత్ర్యమున్నచో నిష్క్రియము లేకుండనే పరిచారికా జనమునకు స్వేచ్ఛ యొసగుదు" నని చెప్పియున్నది; నన్ను విడిపించు నంతటి ధనము నీ కెక్కడిది?

శర్విలకుడు:- నిరుపేద నగునేను నీయందలి నిరవధిక ప్రేమ బంధమున నొక సాహస మొనర్చితిని.

మదనిక:- నాకై అత్యంత విరుద్ధమగు సాహస మొనరింప లేదుగదా?

శర్విలకుడు:- వికసించిన లతవలె విభూషణములచే కలకల లాడు నబలాజనమును దోచలేదు. విప్రస్వమునుగాని, యజ్ఞార్థ మగు నర్థమునుగాని హరింపనైతి. అంకతలమున నిదురించు పసివాండ్రను దాదు లెఱుగకుండ దొంగిలింపలేదు. దొంగతనముమాత్ర మొనర్చితిని. నీవు వసంతసేనతో "ఈ నగ నీకని యాదిపెట్టి చేయించిన నగ. నాయందలి స్నేహముచే దీనినిసీవు

ధరింపవలయును. ఇది అప్రకాశము" అని పలుకుము.

మదనిక :— ఏదీ నగ ?

శర్విలకుడు:— ఇదిగో యలంకరణము.

మదనిక :— (ఇటునటు త్రిప్పిచూచి) ఇది యెచటనో పూర్వము చూచినట్లున్నది. ఇది యెచ్చటిదో చెప్పుము.

శర్విలకుడు:— నీ కావిషయ మెందులకు ? తీసికొనుము.

మదనిక :— (రోషముతో) నాయందు నమ్మకము లేకున్న ఈ యత్న మేల ?

శర్విలకుడు:— దోచిన గృహము చారుదత్తుని దని ప్రభాతమున శ్రేష్ఠిచత్వరమున వింటిని.

మదనిక:— (మూర్ఛిల్లి తెప్పరిల్లి) ధూర్తుడా ! నాకై యీ యకార్యము నాచరించిన నీవు చారుదత్తుని గృహమున ఎవ్వరిని చంపలేదు కదా. గాయపఱుప లేదుగదా !

శర్విలకుడు:— శర్విలకుడు నిదురించిన వారిని భయపడినవారిని ప్రహరింపడు. ఏ ప్రమాదమును జరుగలేదు.

ఈ సంభాషణము వినుచున్న వసంతసేన మేను కంపించినది. హృదయము కుంగిపోయినది. 'ఏ ప్రమాదమును జరుగలేదు.' అను నమృతము మోడువారిన హృదయ లతకు సేచకమై పల్లవింపజేసినది.

మదనిక:— ఈ యలంకారము మా వసంతసేనది. ఆమె ఆర్య చారుదత్తునియొద్ద ఈ భూషణమును నిక్షేపించినది.

శర్విలకుడు:— (విచారముతో) ఆతపబాధ నపనయించు కొనుటకు చేరిన వృక్షరాజమునే అజ్ఞానముచే పత్రహీన మొనర్చితినే. మదనికా కర్తవ్య మేమి ?

మదనిక:— ఈ రత్నాభరణమును చారుదత్తునకిచ్చి రమ్ము. కావున మాయమ్మగారికే 'ఆర్యచారుదత్తుడు తమ కీయగ నిమ్మనినని చెప్పి యర్పింపుము. ఇట్లు చేసిన నీవు దొంగవు కావు. ఆర్య చారుదత్తుడు ఋణ్యుడగును. అమ్మగారి సగ అమ్మగారికి చేరును.

శర్విలకుడు:— చంద్రుడ స్తమింప మార్గదర్శకుడు దుర్లభుడు. ప్రేయసీ! నీసహవాసమున నాకు మార్గము దొరికినది.

మదనిక:— ఈ కామదేవగేహమున ముహూర్తకాల ముండుము. ఆర్యురాలికి నీ యాగమన మెఱింగింతును.

ఇట్లుపలికి మదనిక వసంతసేనకడ కేగి అనుజ్ఞ గొని వచ్చి శర్విలకుని వసంతసేనా సన్నిధానమునకు గొంపోయినది. నమస్కరించిన వసంతసేనను "స్వస్తి భవత్వు" అని ఆశీర్వదించి "అమ్మా! మా జీర్ణగృహమున ఆభరణ రక్షణ దుర్లభము. కావున సువర్ణభాండము పరిగ్రహింపుమ" ని ఆర్య చారుదత్తులు సెలవిచ్చిరి. ఇదిగో "సువర్ణభాండ ము"ని శర్విలకుడు సగను మదనికా హస్తములనిడెను. అంత వసంత సేన "ఆర్య! ఆర్యచారుదత్తుడు ఈసగ తెచ్చిన వారికి మదనిక నర్పింపు మని నా కాన తిచ్చియుండిరి. మదనికను గ్రహింపుడ"ని పలికెను. సంతోషనిర్భరచేతస్కుడు శర్విలకుడు "ఆర్యచారుదత్త! సాధుసాధు. సద్గుణములకు సాధింపరాని దెద్దియు లేదు. చంద్రుడు గుణప్రకర్షము వలననే కదా శంకరుని యుత్తమాంగ ముల్లఘించినది" అని ప్రశంసించెను. వసంతసేన ప్రవహణమును సజ్జమొనరింపజేసి నూతన సహా వరుల నందఱి రోహింప జేసి వీడ్కొలిపెను. మదనికా

శర్విలకులు పయన మొనరించుచుండ 'గోపాలదారకు డగు నార్యకుడు రాజగు నని దైవజ్ఞులు వచించుటచే భయ భ్రాంతుడగు పాలక మహారాజు ఆర్యకుని భయంకర కారా గారమున బంధించెను. అంతట నప్రమత్తులుగ మెలంగ రాష్ట్రాధ్యక్షు లాజ్ఞాపించుచున్నారు' అను వార్త కర్ణ కఠోరమై వినబడెను. శర్విలకుడు ప్రాణస్నేహితు డగు నార్యకుని కారాగారవిముక్తు జేయ దలచి భార్యను రేభిలుని గృహమున దింపుమని చోదకుని నాజ్ఞాపించి 'రాహుముఖము నుండి శశాంక బింబమును వలె మా మిత్రుని విడిపింతును' అని పల్కుచు శరవేగమున రాజవీధి నధిగమించెను.

## అభిసరణము

చారుదత్తుని యాజ్ఞానుసారియై మైత్రేయుడు వసంత సేనను దర్శింప నరిగెను. బహువిధ చిత్రరమ్య మగు నా దివ్య సౌధ మాతని కన్నులకు మిరుమిట్లు గొలిపెను. చేటిక కక్ష్యాంతరముల జూపుచు త్రోవజూప వాని సోయగ మభి వర్ణించుచు ప్రకోష్ఠాష్టకము గడచి రమ్యోద్యానమున నున్న వసంతసేనను సమీపించెను. 'భవతి! స్వస్తియగు గాక' యని యాశీర్వదించి యామె చూపిన యాసనమున నుపవిష్టు డయ్యెను. కుశలప్రశ్నము లయినంతట వసంతసేన 'ఆర్యా! ఏమి పనిపై విచ్చేసితిరి' యని ప్రశ్న సేయ 'న్యాసభూత మగు సువర్ణ భాండమును గెల్తునను నమ్మకముతో, మన యనన్యా న్యానురాగము వలనను జూదమున పణముగ నుంచి యోడి పోయెను. దానికి మారుగా నీ రత్నావళి పరిగ్రహింపుమని చారుదత్తుడుగారు నంపెను. ఇదిగో 'రత్నావళి' యని

యీ నగ నిచ్చెను. ఆ నగ నామె గ్రహించి 'పుష్పములు విరళమయ్యెను సహకార పాదపము మధుబిందువులు చిందును గదా' యని తనలో ననుకొని, ఆర్య మైత్రేయ! ప్రదోష సమయమున నార్యపుత్రుని జూడవచ్చుచుంటి నని యీద్యూత కారునితో వచింపుమని మైత్రేయుని వీడ్కొల్పి 'చేటీ! చారుదత్తు నభిసరింపవలయు నని పల్కెను. అంత నామె 'అకాలమున దుర్దినము వచ్చెను.' అని పలుక 'ఆకసమును మేఘములు కప్పనిమ్ము. అవిరతముగ వర్షము కురియనిమ్ము. దయితాభిముఖ మగు నా హృదయము వేనిని లెక్కింపదు' అని పలికి వసంతసేన ప్రయాణసన్నాహమున నుండెను.

మైత్రేయుడు 'దుంపను బుట్టని తామర తీగెయు మాయావి కాని వర్తకుడును, ముచ్చిలని యగసాలెయు పోరు లేని రచ్చయు, లోభము లేని గణికయు నుండ దని యభియుక్తులు పల్కుదురు. ఔరా! ఏమి దీని కండకావరము విశ్రమింపుడని కాని, పానీయము సేవింపుడనిగాని పల్కలేదే. ఈ దాసీపుత్రిమొగ మెన్నడును చూడను' అని తలచుచు, తనకై నిరీక్షించు చున్న చారుదత్తు డుపవసించిన రమ్యోద్యానమున ప్రవేశించెను. చారుదత్తుడు మైత్రేయుని గాంచి 'మిత్రమా! ఏగినకార్య మే మయినది.' అని యడిగెను. అంత మైత్రేయుడు 'ఏమగును? ప్రదోషమున మీ యొద్దకు వచ్చు నన్నది. రత్నావళి చాల దని యడుగుటకు గాబోలు! వం యూలును, భిక్షకులును, కాయస్థులును, నష్టధనులును గం చోట్ల దోషముల కేమికొఱత. ఓ వెఱ్ఱి మిత్రుడా! 'చెప్పులోని రాతివలె ఈ గణిక నేల విడువ రాదు.' అని ప్రశ్నింప చారుదత్తుడు 'సరుగులువారు తుంగము శక్తిహైన్యమున నిలబడి

నల్లే నేను ప్రేమాలాపములు కట్టిపెట్టి యుంటిని లెమ్ము. ఆమెను రానిమ్ము. ఎట్లైనను సంతృప్తయై పోవును లెమ్ము’ అనిపల్కి దుర్దినవిశేషమును తిలకించుచుండెను.

వసంతసేన ఉజ్జ్వలాభిసారికావేషము ధరించి, ఛత్త్రిధారిణియై విటునితో గలిసి చారుదత్తుని గృహమునకు బయల్వెడలెను. నిరంతర వర్షధారమగు నా దుర్దినము నామె గణింపలేదు. మేఘములు నిరంతరము వర్షించినను, పిడుగులు రాల్చినను, రమణాభిముఖు లగు తరుణులు లెక్కింప రని యా యువ విశ్వాసము, నిరాతంకముగ వీధులు గడచి గృహద్వారము చేరినంత విటుడు ‘సకలకలాభిజ్ఞ వగు నీకుపదేశింప నవసరము కాకున్నను స్నేహము ప్రోత్సహించుచున్నదని కొన్ని యుపదేశము లిచ్చి వసంతసేనాగమనమును ఉచ్చైస్స్వరమున లోని వారి కెరిగించెను. మైత్రేయుడు ఎదురువచ్చి లోనికి గొంపోయి చారుదత్తుడు త్రాగుటకు, తినుటకు గాని పుష్పవృక్షవాటికయం దున్నాడని వసంతసేన కెఱిగించెను. ఆమె సవిలాసముగ నుద్యానము జొచ్చి ‘ఓద్యూతకారుడా! ఈ ప్రదోషము సుఖకరముగ నున్నదా ?’ యని ప్రశ్నించెను. అంత చారుదత్తుడు ‘ప్రియా! జాగరణముననే ఎన్నియో ప్రదోషములు గడచినవి. నిట్టూర్పులు పుచ్చుచుండగనే ఎన్నియో రాత్రులు గతించినవి. నేడు గదా ఈ ప్రదోషము నీసమాగమమున సుఖావహమైనది.” అనిపల్కి ఇందు కూర్చుండుమని యాసనము చూపెను. “ఆర్య! పోయినదనుకొన్న సువర్ణభాండము శంఖమువంటి వసంతసేనాగళమున కెట్టి సోయగము కూర్చినదో చూడుడ”ని మైత్రేయుని కర్ణమున జెప్పిన చేటికి చారుదత్తుడు రత్నాంగుళీయకము బహూ

కరించుట వసంతసేన చూచి 'ప్రియుడా! కాపురనే కామనీయుడ వైతి'వని ఆత్మగతమున మెచ్చుకొనెను. చారుదత్తుడు ఇంకను బహూకరింప లేక పోతినే అను విచారముతో 'రెక్కలు లేని పక్షియు, ఎండినవృక్షమును, జలహీనమగు కొలనును, ఉద్ధృత దంష్ట్రిమగు సర్పమును దరిద్రుడును సమనులు గదా! కోప ప్రసాదములు ప్రతీకార నిరర్థకము లగు దరిద్రుని జన్మ మేల' అని కుందుచుండెను. వసంతసేన రత్నావళి ప్రతిగ్రహింపుడని ఎంత నిర్బంధించినను చారుదత్తు డంగీకరింపక 'పేదరికమున దిట్టికార్య మందలకు ననుమానము కలుగజేయున'ని వారించెను. సరస సల్లాపముల కొంతకాలము పుచ్చి వసంతసేనయు చారుదత్తుడును శయ్యాగారమున కేగిరి.

# విపర్యయము

తొలిసంజవేళ చారుదత్తుడు పుష్పకరండ కోద్యాన విహారమున కేగుచు వర్ధమానకుని 'ప్రవహణమును సజ్జ మొనర్చి వసంతసేనను ఉద్యానమునకు కొనిరమ్మ'ని యాదేశించెను. లేవెలుగు లేగెంపుకిరణములు మైమై సోకుచుండ నిదురమత్తున నున్న వసంతసేనను చెలి ప్రబోధించి పుష్పకరండకోద్యాన గమనమును విన్నవించెను. అంత వసంతసేన ప్రియసంగమోత్సుకత్వము ముమ్మరమై ప్రేరేపింప వేవేగ కాల్యకరణీయములు నిర్వర్తించి చేటితో నేను శృంగారము కై సేసికొందును. ఇంతలో నీవు ఈరత్నావళిని గొంపోయి నేను సవినయముగ సర్పించితి నని ధూతాంబగారి కిచ్చిరమ్మ'ని పల్కి ఆమెనంపి, తానలంకరణ సంవిధానమున నిమగ్న

మయ్యెను. వర్ధమానకుఁడు ప్రవహణమును పెరటి వాకిట నిల్పి ఇంకను అలంకారము కలదని మెత్తిగి మరచిన పఱుపు తెచ్చుటకై ప్రవహణమును తోలుకొని పోయెను. ఆ మార్గముననే శకారుని సారథియగు శకటచోదకుఁడు స్థావరకుఁడు ప్రవహణమును దోలుకొని వచ్చుచుండెను. మార్గమధ్యము పల్లెటూరి బండ్లు చక్రములో చక్రమిరికియుండుట దుర్గమమగుటవలనను, ఆ బండివాండ్రు తనను సాహాయ్యము వేఁడుటవలనను స్థావరకుఁడు తన ప్రవహణమును చారుదత్తుని దొడ్డిగుమ్మమున నిలిపి సహాయ మొనర్పబోయెను.

ధూతాంబ 'చేటీ; ఆర్య వసంతసేనతో నామాటలుగా 'నా కీ రత్నావళి పరిగ్రాహ్యము కాదు. నా ప్రియుఁడు నీకిచ్చినది నే నెట్లు కొందును? ప్రాణప్రియుడే నా కమూల్యభూష' అని చెప్పుము. అనిచేటితో పల్కెనామె సుసజ్జయగు వసంతసేన కౌశల్యకులు విన్నవించి రత్నావళి యొసంగెను. నిరుపమానమగు ధూతాంబ సతీత్వమును అంతరంగమున వేవిధములమెచ్చుకొనుచు వసంతసేన శకటారోహణమున కాయత్తయయ్యెను. ఇంతలో చారుదత్తుని ప్రియపుత్రుఁడు ఇరుగు పొరుగు బాలురు స్వర్ణశకటములతో క్రీడించుట వీక్షించి తనకును అట్టి శకటము కావలయునని పోరుపెట్టెను. దాది మృచ్ఛకట మిచ్చి పొరుమాన్ప జూచెను; గాని యా యత్నము నిష్ప్రయోజనమయ్యెను. అంత నామె బాలు నెత్తుకొని బుజ్జగించుచు వసంతసేన యున్న వైపునకు వచ్చెను. పసిబాలుఁడా వేశ్యను గాంచి "యీమె యెవరు?" అని దాదిని ప్రశ్నించెను. అంత నామె "మీయమ్మ" యని పల్క "కాదు కాదు. మా యమ్మకు నగ లుండవు" అని ముద్దుగ పలుక కరుణయు

ప్రేమయు మమ్మకరమగు వసంతసేన ధరించిన నగలుతీసి బాలున కిచ్చెను. "నీ పెద్దైపోదువు. నేను పుచ్చుకొనను" అని బాలుడు పల్కు పల్కులకు వసంతసేన సమ్మోదమున బొంది యతని నాలింగించుచు నగ నిచ్చిపంపి దొడ్డిగుమ్మము కడకు బోయెను. అచటనున్న ప్రవహణము తమదేయని తలచి యందు దాసీసహాయై తలుపులు బంధించెను.

నాహోయ్యా మొనర్పబోయిన స్థావరకుడు తిరిగివచ్చి శకారునికై ప్రవహణమును దోలుకొని పోయెను. "బండి బరువగనున్న దేమి?" అని ప్రశ్నించుకొని తాను అలసియుండుటచే నట్టియూహ కల్గినదని తలచి నిస్తంద్రచిత్తు డయ్యెను.

## ఆర్యకుడు

'దుర్భేద్య మగు నీ కారాగారము నాకు మరణశయ్యా కాబోలు. ఓహో! దైవమా? నా కీనిర్బంధము గూర్చితి వేల?' యని తరణోపాయము లేని యార్యకుడు పలవించుచుండ, చోరశిఖామణి యగు శర్విలకుడు రక్షకభటులకంట కారము జల్లి సంధి చ్ఛేద మొనర్చి యాప్తమిత్రుడగు నార్యకుని కారాగార విముక్తు నొనర్చెను. ఆర్యకుడు ముక్తుడై శృంఖలములు తోడనే పలాయన మొనర్చుచు నిట్లు చింతించెను. 'నాటి నా దురదృష్ట మెట్టిదో అపరాధము లేకయే నిర్బంధమున జిక్కితిని. నేటి ప్రకృతి యెట్టిదో మృత్యు ముఖమునుండి తప్పించుకొంటిని. మందభాగ్యుడ నగు నే నెటు పోదును. అదిగో నాబోటి దుఃఖపృష్టాంతుని సౌధమే యైయుండును. అనావృత పక్షద్వారమునుండి జొత్తును' అని యందు ప్రవేశించెను.

పఱువునకె పోయిన వర్ధమానకుడు శకటమును గుప్తము నొద్ద నిలిపి 'రదనికా! పరికరసంపన్నమగు నీ ప్రవహణము నధిరోహింప ఆర్యావసంతసేనను 'పంపు' మని' పిలిచెను.

అప్పుడు డాపలుకులువిని 'ఎట్టి యదృష్టము. ఇది గణికా ప్రవహణమువలె నున్నది. బహిర్యానము కదా! అధిరోహించి నిర్గమింతును.' అని తలచి ప్రవహణ మధిరోహించెను. వర్ధమానకుడు కాలిగొలుసుల గణగణధ్వని నూపుర శబ్దముగ భావించి 'అమ్మా! పదిలముగ గూర్చుండు' మని ప్రోత్సహించి ప్రవహణపుటెద్దు నదలించెను. శకటము రాజమార్గమున శర వేగమున బోవుచుండగా ఆర్యకాన్వేషణమున పరిభ్రమించు చున్న చందనకుడు వీరకుడు అను రాజభటులు 'శకటమునం దెవ్వర' ని బండి నడ్డగించిరి. అంత వర్ధమానకుడు 'ఆర్యచారుదత్తుని దీ శకటము. పూజ్యురాలు వసంతసేన ఇందధిరోహించి చారుదత్తుని కలిసికొన పుష్పకరండకోద్యానమునకు పోవుచున్నది!' అని జవాబు చెప్పెను. అంత 'శకటపరీక్షణము చేయుదు' నని వీరకుడు పట్టుబట్టగా చందనకుడు 'ఆర్యచారుదత్త శకటము పరీక్షింప దగదని పల్కెను. 'చారుదత్తు డెవ్వడు? వసంతసేన యెవ్వతె? మనపని మనము చేయుదమని వీరకుడు మొండి చరువగా 'ఏమిరా! చారుదత్తునే యెఱుగవా? అయిన జ్యోత్స్నా సహితుడగు చంద్రుని నెఱుగవు. ఆ ఘనుడు చతుస్సాగర సారభూతమగు రత్నము. ఈనగరమున కీర్త్యారే వెలలేని పగలు. చారుదత్తుని వసంతసేనయు. వారి నవమానించుట తగదని నివారించెను. 'ఏకకార్య నియుక్తు లయిన వీరిర్వురకు నెంతభేద మున్నది. వివాహాగ్నికి దహనాగ్నికి గలభేద మిట్టిదే గదా' యని యార్యకుడు తలచుచుండెను. ఇంతలో "రాజ

బండిలోనికి తొంగిచూచి 'వసంతసేన కాదయ్యా వసంతసేనుడు' అని పల్కెను. ఆర్యకుడు చారుదత్తుని వీక్షించి 'కృతిరమణీయుడే కాదు దృష్టిరమణీయుడు కూడను. అదృష్టా! రక్షింపబడితిని' అని మనసు కుదుటబఱచు కొనెను.

చారుదత్తుడు ప్రవహణాధిరోహణ మొనర్చి, చూచి 'అయ్యా! తామెవ్వరు' అని ప్రశ్నింప మహాశయా! ఆర్యకుడను. శరణాగతుడను రక్షింపుడని పలుక చారుదత్తు డభయమిచ్చి నిగళసంత్యాగ మొనర్చెను. అంత నార్యకుడు బాష్పనిర్భరము లగు చూడ్కులతో వీక్షించుచు 'ఆర్య! దృఢతరములును, స్నేహమయములును నగు శృంఖలములచే బంధించితివి. అనుజ్ఞ యిచ్చిన పోయివచ్చెద' నని విన్నవింప 'శృంఖలము తీసినదే విసటచే చరణములు తొట్రుపడును. పాలకుడు మీ విషయమున కట్టుదిట్ట మొనర్చినాడు. మా యింటిపై ఆప్త బంధువుల గలియుపొమ్ము' అని పల్కి చారుదత్తుడు ఆర్యకుని వీడ్కొల్పెను. 'మిత్రమా! మైత్రేయ! వామాక్షి స్పందించుచున్నది. హృదయము వికలమైనది. పోవుదము రమ్ము' అని పల్కి మైత్రేయునితో కలిసి గృహాభిముఖముగ పయన మొనరించెను.

## అత్యాచారము

శకారుడు విటునితో గలిసి ఉద్యానమున విహరించి అలసిపోయి 'స్థావరకు డింకను ప్రవహణము తోలుకొని రాడేమి' అని చింతించుచు నిరీక్షించు చుండెను. "అయ్యో! పొద్దు నెత్తిపై నున్నది. ఆలస్య మయిన దని శకారుడు కోపించును. ఏమి చేయుదును? గత్తలారా పరుగెత్తుదు" అని పల్కు స్థావరకుని పలుకులు వసంతసేనవిని 'ఇది వర్ధమానకుని

స్వరము కాదు. ఆర్య చారుదత్తుడు మఱియొక ప్రవహణము
నంపియుండునా? అయ్యో! కుడికన్నదరుచున్నది. హృద
యము కంపించుచున్నది.' అని తలచుచు గడగడ వణకుచుండ
శకటము గమ్యోద్యానమును జేరెను. స్థావరకుడు బహిర్ద్వార
మున నుండియే శకారునికి నమస్కరించి 'ఏ ద్వారమున
ప్రవహణము లోన ప్రవేశింప వలయునో యాజ్ఞ యొసంగుమని
ప్రార్థింప 'ప్రాకార ఖండముపై నుండి ప్రవేశపెట్టుము'ని
శకారు డాజ్ఞాపించెను. 'ఆర్యా వృషభములు చచ్చును, నేనును
జీవింపన'ని స్థావరకుడు పలుక 'ఓరి మూర్ఖుడా! వృషభములు
చచ్చిన క్రొత్తవి వచ్చును. బండి విఱిగిన యింకొక దానిని
కొందును. నీవు పోయిన మఱియొక ప్రవహణ చోదకుడు
వచ్చును. ఏమైన కానిమ్ము. నే చెప్పినట్లు ప్రవేశపెట్టుము'ని
శకారుడు హెచ్చరించెను. స్థావరకుడు స్వామి యాజ్ఞ [illegible]
ప్రవహణమును చెక్కు చెదరకుండ నడిపించెను. అంత
శకారుడు 'మిత్రుడా! గుణజ్ఞుడవగు నిన్ను లోకులెల్ల
గౌరవింప వలయును. ముందుగ శకట మధిరోహింపు'మని
పల్కి విటుడు శకట మధిరోహించు చుండగా క్రిందకు లాగి
'ఇది నీ యబ్బ సొమ్మనుకొంటివా? ముం దెక్కుచుంటివి?
శకటస్వామి నగు నేను తొలుత నధిరోహింతును' అని వచించి
శకటారోహణ మొనర్చి, వెంటనే క్రిందికి దూకి విటుని
కంఠమున కౌగిలించుకొని యిట్లు పలికెను. 'బావా! బావా!
చచ్చితిని. చచ్చితిని. ఇందున్నది రాక్షసియో! చోరుడో!
రాక్షసియైన నిద్దరము చచ్చితిమి' అని ప్రలాపింప విటుడు
'నీ కేమి పిచ్చియా! బండిలో రాక్షసి యెట్లుండును?
స్థావరకుని కంచుక చ్ఛాయను వీక్షించి భ్రమించి యుందువ'ని

పల్కి అంత శకటమును వీక్షించి 'హరిణి వ్యాఘ్రము ననుసరించిన దేమి ? అయ్యో ? హంసి హంసను పరిత్యజించి వాయసమును చేరినది.' అని చింతించి 'వసంతసేనా ! నీ కిది తగదని పల్కెను. 'ఆర్య ! ప్రవహణ విపర్యయ మిట్టి ముప్పు తెచ్చిన' దని వసంతసేన పలుకగా 'భగము మంగసము. వీనిని మోసగించెద'నని పల్కి 'శకారా! ఇందెద్దియో భూతమున్నది. బండిమాట దేవుడెరుగును. చల్లని నీడ నిచ్చు నీ యుద్యానము లలో నుండి కాలినడకను పోవుదము రమ్మ' అని విటుడు పల్కెను. అంత శకారుడు కాదు కాదు. బండి యెక్కియే పోవలయును. దూరమున నుండియే నన్ను చూచి జనులు 'అడుగో! రాష్ట్రియ శ్యాలకుడు పోవుచున్నా డను కొందురు' అని పలుకగా 'విషాపనోదనము దుష్కరమైనదే' యని విచారించి విటుడు శకారా! నిన్నభిసరింప వచ్చిన వసంతసేన యిందున్నద'ని పలికెను. ఈ పలుకులు వసంతసేన చెవులకు ములుకులయ్యెను. శకారుని వీనులకు విందులయ్యెను. అంత శకారుడు 'ఓ విశాల నేత్ర ! నీ చరణములపై పడుదును. ఓ శుద్ధదంతి ! నీకు చేతులు మొగుడ్తును. మదనాతురుడనై పూర్వము నీ కొనరించిన యెగ్గులు క్షమింపుము. నీ దాసుడను' అని పాదములపై బడెను. వసంతసేన 'మూర్ఖుడా! తొలగి పొమ్మ'ని చరణమున దన్నెను. పదతాడిత భుజంగమువలె రోజుచు శకారుడు కేశపాశము పట్టి యీడ్వబోవ విటుడు 'సుగుణవతులగు నబలలు మూర్ధజములు ముట్టరానివారు. ఉపవనోద్భవము లగు లతలు పల్లవచ్ఛేదార్హములు కావు గదా!' యని పల్కి శకారుని వారించెను. అంత వసంతసేన శకటము దిగి ఈరము మరుగున కరిగెను. 'శకారుడు మిత్రమా!

మాంసఖండము తోడి మృష్టాన్న భోజనమున సంతృప్తి నంద గోరితివా నా కొకమేలు చేయుమ'ని విటు నోడబరచి 'ఈ బోగపు తొత్తును వధింపు' మని పల్కెను. విటుడు చెవులు మూసికొని 'ఎంతమాట యంటివి? నగరాలంకరణమగు నీ సుగుణ పుంజమును వధించి పరలోక నది నెట్లు తరింతును? దుష్కృత్యమునకు సాక్షులెవ్వరని తలపకుము. సూర్యచంద్రులు, పదిదిశలు, ధర్మానిలులు, ఆత్మ, భూమి ఎన్ని లేవు' అని నిరాకరించెను. 'సువర్ణకటకములిత్తు' నని యాశ పెట్టినను స్థావరకు డంగీకరింపలేదు. శకారుడు అందఱిపై కోపగించుకొని స్థావరకుని వెడలగొట్టెను. ముసలిబాపం డేమిచేయునను ధైర్యముతో వసంతసేనను చంపబోయినంత విటుడు మెడపట్టి పులుగఱచునట్లు పడద్రోసెను.

శకారుడు తెప్పరిలి 'నా ఉప్పుతిని బలిసి నాకే ఎదురైతివా' అని నిందించి, కొంత చింతించి 'వయస్యా! ఉత్తమ కులీనుడ నగు నేను వసంతసేనను చంపుదునా? బెదరించిన ప్రేమించునని తలచితిని. నీ యెదుట నాపై ప్రేమ చూపుటకు సిగ్గిలుచున్నట్లున్నది. నీవు దూరముగ పొమ్ము' అని విటుని బ్రతిమాలెను. 'కామము వివిక్త విస్రంభరసము; కావున ఏకాంతము కల్పించి చూతు' నని విటుడు పొదరింటి చాటున నక్కి చూచుచుండెను. శకారుడు విటుని మోసగించుటకై కుసుమాపచయ మొనర్చి తా నలంకరించుకొని వసంతసేన నలంకరింప యత్నించుచుండెను. విటుడు 'నిజముగ శకారుడు మరులుగొని యుండె' నని నమ్మి వెడలిపోయెను.

“ఓ సుదతి! సువర్ణమిత్తును. పాదములకడ మోకరిల్లుదును. ప్రియ మొనరింతును. అని మొత్తుకొన్నను నన్ను

శార్విలకుడు 'ఈ గలగల యేమి?' అని ఇటు నటు చూడ శుష్క పత్రముల మాటున అలంకార భూషిత మగు స్త్రీ హస్తము కనబడెను. అంత నాతడాకులు తొలగించి పరిశీలించి చూచి 'అయ్యో! నా వంటి జూదరులకు సన్మార్గము చూపిన యీ మహనీయకా యీ యాపద. ఈ కుసుమ కోమలిపై చేయివేయ పాషాణ హృదయుడైన యత్నించునా? ఈ ఘోర మాచరించిన రాక్షసు డెవ్వడు' అని వగచుచు నీరుకావిదోవతి తడిపి తెచ్చి పిడిచిన నీటితో మొగము కడుగుచు, నోట నీరు వోయుచు సేదతీర్ప సాగెను.

## అభియోగము

'భద్రశోధనక, కార్యార్థు లెవ్వరైన నిరీక్షించు చుండిరేమో తెలిసికొమ్మ'ని అధికరణికు డాజ్ఞాపింప శోధనకుడు వినమ్రుడై 'చిత్తము' అని పల్కి బయట కేగి 'కార్యార్థు లెవ్వరైన గలరా?' అని ఎలుగెత్తి పిలిచెను. శకారుడు సంతోషముతో పురుష శ్రేష్ఠుడను, రాష్ట్రియ శ్యాలకుడ నగునేను కార్యార్థిననెను. "అయ్యో! తొలుతనే శకారుడా" అని శోధనకుడు విచారించి 'అయ్యా! ముహూర్తము తాళుము. అధికరణికునకు విన్నవించి వత్తును. అని పల్కి లోనికి బోయి 'ఆర్యులారా! శకారుడు వచ్చి యున్నాడ'ని పల్కెను. అధికరణికుడు 'ప్రథమముననే రాష్ట్రియ శ్యాలుడా కార్యార్థి? ఏదో చిక్కు వ్యవహారమై యుండును. శోధనక! నీవు పోయి నేడు కాదని యాతనితో చెప్పుమ'ని యాజ్ఞాపించెను. శోధనకు డట్లు చెప్పినంతనే శకారుడు మండిపడి 'ఏమీ! నా వ్యవహారము చూడడా? మా బావతోడను అక్కతోడను

చెప్పి ఈ అధికారిని తొలగింప జేసెదను. మరియొక్కని నియమింప జేసెదను. అని బెదరింప శోధనకుడు "ఆర్యా! క్షణ ముండుమని యాతని నాపి అధికరణికున కీవృత్తాంతమంతయు నెఱిగించెను. అంత నతడు 'ఈ మూర్ఖు డన్నంతయు చేయింపను చేయింపగలడు. రమ్మనుము. అలసి వ్యవహారము చూతము" అని పలుక శోధనకుడు శకారుని సమీపించి 'ఆర్య! ఆర్యులు రమ్మను చున్నారు. తమ వ్యవహారము చూతురట' అని విన్నవించెను.

అంత శకారుడు "మొదట చూడ మనిరి. ఇప్పుడు చూత మనుచున్నారు. భయపడినారు. చెప్పిన దంతయు నమ్మింపగలను." అని మంటపమున ప్రవేశింప "ఇట ఉప విష్టులు కండ"ని అధికారి పలికెను. "ఇది నాతావు. ఇష్టము వచ్చినచోట కూర్చుందును. (అధికారి తలపై చేయి పెట్టి) ఇక్కడ కూర్చుందును. కూర్చుంటెని" అనిపల్కి శకారుడు భూమిపై కూర్చుండెను.

అధికరణికుడు "ఆర్యశకార! మీకార్య మేమి?" యని పృచ్ఛసేయ శకారుడు 'నీచెవిలో చెప్పెదను. మాతండ్రి రాజుకు మామగారు. రాజు మానాయన కల్లుడు. నేను రాజ శ్యాలుడను. రాజు మా సోదరిభర్త' అని పల్కెను. అందుపై అధికారి 'అంతయు నెరుగుదునయ్యా. కులముతో ప్రయో జనమేమి? సుక్షేత్రమున ముండ్లచెట్టు పుట్టుటలేదా? ఇచ్చట కావలసినది శీలమే. నీకార్య మేమో చెప్పుము' అని పలుక 'మాభగినీపతి సంతుష్టుడై నా కొక ఉద్యానమును క్రీడింప నొసగెను. ప్రతిదిన మచ్చటకు పెంచుటకు త్రెంచుటకు పోవు చుందును. దైవయోగమున చూచినను చూడకున్నను స్త్రీ

శరీర మచ్చుట నున్నది. అయునిద నగరభూషణ మగు వసంతసేన యను వారకాంత యనుకొనెదను. ఎవడో భూషణముల కొఱకు చంపియుండును. నేనుకాదు' అని పలుక 'శ్రేష్ఠికాయస్థులారా! 'నేనుకాదు' అనునది తొలుతగా వ్రాయుడు' అని అధికరణికు డాజ్ఞాపింప శకారుడు తెప్పరిలి 'అధికరణ భోజకులారా! ఏమి యీ గగ్గోలు. నేనుకామా నేనేమూచితిని' అని పల్కుచుంటివయ్యా' అని పదికి కాలి వ్రేలితో లిఖితాక్షరముల తుడిచివేసెను. 'ధనార్థులు చంపిరని యెట్లు నిరూపింతువు.' అని అధికరణికుడు ప్రశ్నింప 'భోగ వనిత యెన్ని యాభరణములు ధరింపదు? ఆభరణస్థానము లన్నియు శూన్యములుగ నున్నవి' అని శకారుడు పలికెను. అధికరణికుడు శ్రేష్ఠికాయస్థులు పరస్పర సమాలోచనము జరపి వేశ్యమాతకై శోధనని పంపిరి. వేశ్యమాత శోధనునితో నేతెంచి అధికరణికు డాదరముతో కూర్చుండుమ మని పలుక ఆసీనయయ్యెను.

అంత అధికరణికుడు "వసంతసేన యెచ్చట" నని ప్రశ్నింప 'మిత్రగృహమున' నని పల్కి 'మిత్రుడెవ్వ' రని గుచ్చి యడుగుటచే వృద్ధవేశ్య లజ్జతో కుంగి పోయెను. 'ఇది వ్యవహారము. లజ్జకు సమయముకాదు.' అను నాధికారిక వచనమునకు లోగి 'వ్యవహారమైన విన్నవింతును. సుప్రసిద్ధ నామధేయుడు ఆర్య చారుదత్తుడు నాప్రియ పుత్రికకు మిత్రుడు యన్యోన్యసుఖ మనుభవింప నాతనిగృహమున కేగినది' అని పల్కెను. అధికరణికుడు 'చారుదత్తుని గృహమున కేగినది' అని వ్రాయు డని కాయస్థుల కాజ్ఞాపించి చారుదత్తుని గొని రమ్మని శోధకుని నంపెను.

శోధనకుని వెంట చారుదత్తు డేతెంచుచు 'ఆర్యకుని వృత్తాంత మేమైన చాకచక్యుడగు నృపతికి తెలియ వచ్చెనా? నేను అభియుక్తుడను గదా! ఈ విచారముతో పనియేమి? అధికరణ మంటపము చేరవచ్చితిని గదా' అని తలచుచు, దుర్నిమిత్తముల శంకించి దేవతల మంగళ మాచరింప ప్రార్థించి, మంటపము ప్రవేశించెను. అధికరణికుడు చారుదత్తు వీక్షించి 'ఆకార మెంత యుదాత్తము? ఆకారము వృత్తమును విడువదు' అని తలచి 'ఆర్య స్వాగతము' అని చారుదత్తు నాహ్వానించి 'శోధనక పూజ్యులకు ఆసనము వేయుము.' అని శోధనకు నాజ్ఞాపించెను. శకారుడు క్రోధవివశుడై 'ఓ స్త్రీ ఘాతకా! వచ్చితివా? అహో ఏమి ధర్మము? స్త్రీ హంతకునకు ఆసన మిచ్చుటా?' అని యాక్షేపించెను. 'నా ప్రియ పుత్రి యున్నంతను నీ సుందరున కర్పించి ధన్య యయ్యె.' నని వేశ్యమాత సంతసించెను.

'ఆర్య చారుదత్త! ఈమె పుత్రిక నీకు మిత్రమగునా?' అని అధికరణికుడు ప్రశ్నింప చారుదత్తుడు లజ్జావనత వదను డయ్యెను. 'ఇది లజ్జకు సమయము గాదు. ధైర్యముతో సత్యము వచింపుము' అని అధికరణికుడు పలుక 'ఎవనితో వ్యవహారమ'ని ప్రశ్నించి శకారునితో నని చారుదత్తుడు గ్రహించెను. 'ఆర్యాధికరణిక! వసంతసేన నా స్నేహితురాలు. ఆమె యింటికి చనినది' అని అధికారులతో వచించెను. అంత శకారుడు 'ఓ అసత్యవాదీ! నా యుద్యానమున ప్రవేశించి ఆభరణములకై యా పేశలగాత్రిని మారణహోమ మొనర్చి 'గృహమున కేగినద'ని పల్కుచుంటివా? అని నిందించెను. "మూర్ఖ శకారా! ధన ధాన్యములను, రత్నాభరణాదులను

నర్థుల కిచ్చిన యీ దానవీరుడు ఆభరణములకై చంపె నని యెట్లు నమ్మెదము" అని అధికారులు బల్కిరి. "దుర్మార్గుడా దాచిపెట్టిన సువర్ణభాండమును చోరు లపహరింప చతుస్సముద్ర సారభూత మగు రత్నావళిని నా పుత్రిక కర్పించిన యీ మహనీయునిపై చలిదిముద్దబోటి చేయని నగలకై వధించె నని నేర మారోపించు చుంటివా?" అని శకారుని జూపించి వేశ్యమాత పుత్రికను దలచి వెక్కి వెక్కి యేడ్వ దొడగెను. "నడచివెళ్ళెనా? బండిపై వెళ్ళెనా" యని ప్రశ్నింప 'నేను చూడలేదు' అని చారుదత్తుడు పల్కెను.

చందనకునిచే దెబ్బలు తిన్న వీరకుడు ప్రవేశించి "అయ్యలారా! నాయభియోగము విని తీర్పు చెప్పుడు. కారాగారమునుండి పారిపోయిన గోపాలకునికై చందనకుడును, నేనును వెదకుచుండ ఆర్య చారుదత్తుని ప్రవహణ మెదురయ్యెను. చందనకుడు ముందు పరిశీలించి 'ఆర్య వసంతసేన యిందున్నద'ని పల్కెను. నేనుగూడ పరిశీలింతు నని పరిశీలింప బోవ జుట్టుపట్టి యీడ్చి పదాఘాత మొసర్చినాడు. న్యాయము విచారింపుడు' అని విన్నవించుకొనెను. 'నీవిషయము తరువాత విచారింతుము. గుఱ్ఱముపై పోయి పుష్ప కరండకోద్యానమున స్త్రీశవ మేదైన కలదేమో చూచి రమ్ము'ని యధికరణికు డాతని పంపెను. అతడు తిరిగివచ్చి 'అయ్యా! చూచివచ్చితిని. కుక్కలు సగముతిన్న స్త్రీ శవమొక్కటి యిచ్చట నున్నద'ని చెప్పెను. వసంతసేన నిజముగ చంపబడిన దని అధికరణికుడు నిశ్చయించి "ఆర్య చారుదత్త! నిజము చెప్పు"మని యొత్తి పలికెను. "ఆర్యులారా! పుష్పభరమున కలకలలాడు లత కూనను వంచి పుష్పము కొఱకైనను కోయుట పరమ

పాపముగా తలచునేను భ్రమరసుభగ మగు కేశపాశము పట్టి వధింతునని మీరు నమ్మెదరా! పరగుణ మాత్సర్యమునను రాగాంధతతో నుపడ ప్రత్యర్థ్యకై యత్నించు దుష్టాత్ముల జాతి దోషమున పల్కినది గ్రాహ్యము కాదు. అది విచారణీయము కాదు" అని అధికరణికు డక్కు మోగ్గై పలికెను.

స్వర్ణశకటము చేయించుకొమ్మని రోహసేనున కిచ్చిన నగలను చారుదత్తునిపనుపున వసంతసేన కిచ్చుటకై పోవుచున్న విదూషకుడు చారుదత్తు డధికరణ మండపమునకు పోయె నని విని తానును అచటికే పోయెను. చారుదత్తునితో కుశల సంభాషణ మొనర్చి శకారుడు తెచ్చిన యభియోగ మెరిగి "ఓ ఆర్యులారా! ఏ యార్యుడు పురమందిరమును, విహారారామములను, దేవాలయములను, కూపతటాకములను నిర్మించి ఉజ్జయినికి వెలుగు తెచ్చెనో ఆ వితరణశాలి అర్థకల్యవర్తము నకై యిట్టి యకార్య మొనర్చునా? ఓరీ కులటాపుత్రా! రాజశ్యాల సంస్థానక బహుసువర్ణ మండిత మర్కటక! ఏదీ నాయెదుట చెప్పుము. లాగినపల్లవము చిరుగునని లతను వంచి పుష్పాపచయ మొనర్పని యీ దయాశాలి ఇహపర ముల జెఱచు నీయకార్య మొనర్చెనా? ఓరికుట్టినీపుత్రా! ఆగుమాగుము. నీ హృదయమువలె వంకరగ నున్న యీ దండముతో నీతల నూరువ్రక్కలొనర్చెదను" అని శకారుని తో కలియబడెను. ఈ కలహమున విదూషకుని చంకనుండి ఆభరణముల మూట క్రిందపడెను. శకారుడా మూటవిప్పి ఆర్యులారా! చూడుడు. ఈ చల్దియన్నము ముద్దకొఱకే చారుదత్తుడీ యకార్య మొనర్చినది" అని యా యాభరణముల నధికారులకు చూపెను. "అమ్మా! ఈ నగలు నీపుత్రికవేమో

పరిశీలింపుము" అనగా వృద్ధవేశ్య పరిశీలించి "ఇది యట్లనే యున్నది. ఇది కాదు" అని పల్కెను. అపుడు అధికరణికుడు "శిల్పివర్గము సదృశములు నెన్నింటినైన కల్పింపగలదు" అని పలుక శ్రేష్ఠికాయస్థులు "ఇవి ఆర్య చారుదత్తుని వేమో" అని పల్కిరి.

అంత చారుదత్తుడు 'కాదుకాదు అవి వసంతసేనవే' అనిపలికెను. అధికారులు 'సత్య మాచిన దాగదు. పాపము నాపాదింపక సత్యము వచింపుము. సుకుమార మగు నీ శరీరమును కశాఘాతములు కౌగలింపక మున్నె సత్యము వచింపుమని కోరగా, చారుదత్తుడు వసంతసేనా విరహిత మగు జీవితము నొల్లని వాడగుట 'ఆర్యులారా! ఐహికాముష్మికముల జాడ నెరుంగని, కృతఘ్ను డనగు నేనే స్త్రీ రత్న మగు వసంతసేనను....' అని దోష మంగీకరించెను. అంత అధికరణికు నాజ్ఞచే రాజపురుషులు చారుదత్తుని నిర్బధించిరి. వృద్ధమాత పెద్దపెట్టున నేడ్చుచు 'అయ్యలారా! ఆగుడాగుడు. నా ప్రియ పుత్రిక చచ్చిపోయినను, ఈ దీర్ఘాయువు జీవించుగాక. అర్థి ప్రత్యర్థులకు గదా వ్యవహారము. నేను అర్థిని. ఈయనను విడువుడు" అని అధికారుల బ్రతిమాలినది; కాని అధికారు లంగీకరింపలేదు. అధికరణికుడు "ఆర్య చారుదత్త నిర్ణయము మాదంతు. మిగిలిన దానికి రాజు గలడు. శోధనక! 'విప్రుడు పాతకి యయ్యును నవధ్యుడు. అతని విభవము లతని కిచ్చి దేశమునుండి వెడలగొట్ట నగును.' అని మనువచనముగలదని రాజుతో చెప్పు"మని యాజ్ఞాపింప శోధనకుడు పోయి మరలి వచ్చి 'అయ్యలారా! ఏ యాభరణములు కొరకు చంపెనో వాని నాహంతకుని గళమునగట్టి ఎనుపైన నిట్టించిచేసిన వాని కీగతియే

పట్టణము నినాదముగల చాటింపులతో నూరేగించి దక్షిణ శ్మశానమున శూలారోపణము చేయింపు'డని రాజుగా రాజ్ఞాపించు చున్నార''ని వచించెను.

చారుదత్తు డీయాజ్ఞ విని మంత్రుల యవివేకము రాజులను పాపపంకమగ్నుల జేయునుగదా యని విచారించెను. వయస్యుని మైత్రేయుని వీక్షించి'' ప్రియసఖా! గృహమునకు పోయి నా మాతృదేవతకు నాకు మారుగా నభివందనము చేయుము. ధర్మైకజీవితను నాభార్య నూరడింపుము. ముక్కుపచ్చలారని పసిబాలుని కనిపెట్టుకొని యుండుము. మూలచ్ఛేదమున పాదపమును రక్షించుటెట్లని తలపకుము. లోకాంతరస్థుల దేహమునకు ప్రకృతి గదా పుత్రుడు. నాపై ప్రేమను సుతునిపై జూపుము. కొడుకు పూర్వము ముద్దుపట్టి నొకమారు చూపుము'' అని వయస్యుని ప్రార్థించి అతని పంపివైచెను. అధికరణకునియాజ్ఞచే చండాలు రిర్వురు చారుదత్తునిగొంపోయిరి.

## సమాగమం

'ఆర్యులారా! తొలగుడు తొలగుడు. కరవీరదామము కల యీయన చారుదత్తుడు. అచిరకాలముననే కాల పరశుధారల కెరగాబోవు చున్నాడు. ఏమి చూచెదరు? తొలగుడయ్యా తొలగుడు. ఓరీ చారుదత్తా! నడువుమురా' అని చారుదత్తు నదలించి నడపించుచు చండాలురు రాజవీధిని బోవుచుండిరి. అట్టియెడ పౌరులు శకారుని పాలక మహారాజును నిందించుచు చేయునది లేక కన్నీళ్ళు కార్చుచుచు 'ఆర్యచారుదత్తుడు స్వర్గమును నలంకరించు గాక' యని భగవంతుని ప్రార్థించు చుండిరి. ఆ సమయమున వానయు నుఱుములును

యుశ్లోకీపిత్రధారణ మొనర్చెను. ఒక చెండాలుడు 'ఓరీ చారు దత్తా!' యని పిలువ రెండవవాడు "అరే! ఆర్య చారుదత్తుని నిరుపపదముగ పిలుచుచుంటివా? చంద్రుడు రాహుగ్రస్తుడై నను జనులకు వంద్యుడు గదా!" అని అదలించి 'ఆర్య చారు దత్తా! వేళ యైనది. కదలుడ'ని పలుక రోహసేనుడు 'అయ్యా! మా తండ్రిని వదలుడు. నన్ను చంపుడ'ని చాండాలుర బ్రతి మాల 'ఇటుల పల్కుచు చిరకాలము జీవింపుము నాయనా' అని చండాలురు పల్కిరి. చారుదత్తుడు గాఢముగ పుత్రాశ్లేష మొనర్చి 'దరిద్రులకును భాగ్యవంతులకును స్నేహసర్వస్వమగు నీ యాశ్లేషము అనౌశీరము, అచందనము నగు హృదయాను లేపనము' అని కన్నీళ్ళు కార్చెను.

చండాలురు మూగిన జనుల నొత్తిగించుచు 'తొలగుడు బాబూ తొలగుడు. త్రాడు తెగి నూతిలో మునుగుచున్న కనక కలశమును వలెనున్న యార్యునినేమి చూచెదరు?' అని పల్కి మరల ఘోషణ మొనర్చిరి.

శకారునిచే బంధింప బడిన స్థావరకుడు సమీప సౌధ మున నుండి ఘోషణమును వినెను. 'అయ్యో! నిర్దోషి యగు నార్య చారుదత్తునకు మరణదండనమా? బిగ్గరగ నరచెదను. ఆర్యులారా! వినుడు వినుడు పాపినగు నేను ప్రవ హణ విపర్యయమున వసంతసేనను పుష్పకరండకోద్యానమునకు గొంపోయితిని మా ప్రభువగు శకారుడు నన్ను ప్రేమింపవా యని బాహు పాశముచే నామెను చంపెను. ఈ యార్యు డేమియు నెఱుగడు. అయ్యో! దూరముకావున ఎవ్వరునామాట వినిపించుకొనరైరి. సంకెలలతోనే తెఱచియున్న ఈ గవాక్షము నుండి క్రిందపడుదును. నేను మరణించిన నేమి? కులపుత్రి

విహగములకు నివాస పాదపమగు నార్య చారుదత్తుడు జీవించిన జాలును. (గవాక్షమునుండి క్రిందపడి) అరరే! ఆశ్చర్యము. నేను చావలేదు. సంకెల లూడినవి. పరుగెత్తెదను' అని పరుగెత్తిపోయి సర్వము వినిపించెను. చారుదత్తుడు 'ఏదైన్యము? అనావృష్టి దోషమున ఎండబాఱిన చేనుపై ద్రోణమేఘమువలె వచ్చినాడు. మరణమునకు వగవను. అపయశమునకు వగతును. దుర్మార్గశకారుడు నిందించెనే యని వగచెదను' అని పలికెను. చండాలురు స్థావరకుని నిగ్గదీసి యడిగి ఆర్య చారుదత్తుడు నిర్దోషియని తెలిసికొనిరి. "మేడమీద నుండి చావునకు లెక్క చేయక క్రిందపడిన నేను అబద్ధమేల యాడెదన"ని స్థావరకుడు వచించెను.

'మాంసఖండములతో సమస్త్యాకమగు సూపముతో భుజించితిని. (చెవియొగ్గి) చాండాలుర స్వరమువలె నున్నదే? అదిగో పటహధ్వని. దరిద్ర చారుదత్తుని వధ్యస్థానమునకు గొంపోవుచుండిరి. శత్రువినాశము హృదయానందకరముగదా. శత్రువధను చూచిన వారికి అక్షిరోగము రాదందురు. పోయి చూచెదను. కాదుకాదు. ఆర్య శకారుని దివ్యప్రాసాదోపరిభాగ మెక్కి చూతును. ఎంత జనసమూహము. ఇక్కడ యీ గుంపాగిన దేల? (లోపల చూచి) అరే! స్థావరకు డేడీ? వీడు రహస్యము వెల్లడి చేయలేదు కదా. పోయి చూతును' ఇట్లు తలచి పైనుండిదిగి గుంపునడుమ నున్న స్థావరకుని చూచి జనుల వంచింపదలచి "అయ్యా! వీడు నా సేవకుడు. బంగారపు గొలుసు దొంగిలించుటవలన కొట్టి బంధించితిని. ఆవైర భావమున పలికినది సత్యమెట్లగును?"అని బిగ్గరగాపలికి ఎవరును చూడకుండ స్థావరకుని చేతిలో బంగారుగొలుసు పెట్టి "మన

రొక విధముగా చెప్పు" మనెను. స్థావరకుడు వచ్చి ప్రక్కకొని "ఆర్యులారా! చూడుడు. నేను తెలుపని నాయంశమును మిచ్చు చున్నాడు" అని పలుక "ఇదియే నా [illegible]. ఈతడు నా సువర్ణ భాండాగారమున సువర్ణము దొంగిలించుచుండ అనేక పర్యాయములు కొట్టితిని. చండాలులారా! వాని వీపు చూడుడు" అని శకారుడు పలుకగా చండాలురు స్థావరకుని పృష్ఠభాగ మువలక్షించి శకారు వచనములు నమ్మిరి. స్థావరకుని మాటలు నమ్మకైరి. స్థావరకుడు చారుదత్తుని పాదములపై బడి నా విభవ మిట్టిదని దుఃఖించెను. చారుదత్తుడు "పరోపకారులగు సాధుజనులపై దయ చూపుచో నీ [illegible]! లెమ్ము. నా దౌర్భాగ్యమునకు నీ వేమొనర్తువు" అని ఓదార్చెను.

శకారుడు ఆలస్యము తగదని తలచి 'ఏల ఆలస్య మొనర్చుచున్నారు? కుఱ్ఱవాడు కూడ ఇచటనే యున్నాడు. ఇర్వురను కొఱతవేయుడు" అని చండాలుర కాజ్ఞాపింప "మాకు రాజుగా రట్టియాజ్ఞ నీయలేదు. కుఱ్ఱవాడా! దూరముగ పొమ్ము" అని చాండాలురు పిల్లవాని నదలించిరి. చారుదత్తుడు నాయనా! మూఢుడే మైన జేయింపగలడు. తల్లి యొద్దకు పొమ్ము. వయస్యా! వత్సను ఆశ్రమమునకు గొని పొమ్మ"ని దుఃఖవివశుడై పల్కెను. అది మూడవ ఘోషణా స్థానము కావున డిండిమము మ్రోగింపబడెను.

అంత చండాలుగు చారుదత్తుని వధ్యస్థానమునకు గొని పోయిరి. చారుదత్తుడు తన నాలుకతో నీహత్య నంగీకరింప కున్న పౌరులు ప్రత్యయము కాదని తలచిన శకారుడు చారుదత్తునిచే చెప్పింప యత్నించెను. అందు విఫలుడై కశా ఘాత మొనర్చ చండాలుర ప్రోత్సహింప వారు మోదుచుండే

చారుదత్తుడు 'పౌరులారా! బ్రాహ్మణుడగు నీ చారుదత్తుడు ఈ యకార్య మొనర్చె' నని పౌరులకు విన్నవించెను. చండాలు రిర్వురు 'చారుదత్తుని చంపు వంతు నీది నీది' యని పంతము లాడుకొని లెక్కలు వేసి చీట్లు వేసికొనిరి. అందు వంతు వీరకుని దని నిర్ధారణ కాగా 'అరే ముహూర్త మాగెదను మా తండ్రిగారు స్వర్గగమన మొనర్చుచు 'నాయనా వధ్యపాలిక నీ వగుచో వెంటనే వధ్యుని వధింపకుము. సజ్జను డెవ్వడైన నర్ధ మొసంగి విడిపింప వచ్చును. రాజుకు పుత్రోత్సవము కలిగిన వధ్యులు ముక్తులగుదురు. గంధగజము ఆలానము వీడ బెడికి స్వేచ్ఛావిహార మొనర్చుచో సంభ్రమమున వధ్యుడు ముక్తుడగును. రాజులు మారినను ముక్తి లభించును' అని బోధించి యుండిరి.' అని పలికెను. ముహూర్తము తాళి 'ఆర్య! చారుదత్త! ఇది రాజాజ్ఞ. మాదోష మిందేమియు లేదు. స్మర్తవ్యముల స్మరింపుము' అని చారుదత్తుని హెచ్చరించెను.

చారుదత్తుడు "మూషితుడ నగు నాకు నదృష్టవశమున ఏమాత్రము ధర్మము కలిగినను పూజ్యురాలగు వసంతసేన ఎక్కడ నున్నను నా కళంకము కడిగివేయు గాక" అని పల్కి "అయ్యా! నే నెక్కడ కూర్చుండవలయును." అని చండాలురతో పల్కెను. 'అదిగో నక్కలు సగము కళేబరమును లాగుచున్నవి మిగిలినది కొట్టున నున్నది. అచ్చట కూర్చుండ వలయును' అని వీరకుడు పలుక చారుదత్తుడు నిర్భయుడై పోయి యూపవిష్టు డయ్యెను. అప్పుడా తలారులు 'ఆర్యా! ఆకసమున విహరించు సూర్యచంద్రులకే యాపదలు కలుగుచున్నవి. మానవులకు కష్టములు వచ్చుట నేమంత యబ్బురము? కొందఱు లేచుచుందురు. మఱికొందరు పడుచుందురు. క్రిందపడు క

లేచుచు ఆ వస్త్రముకూడ నెగురుచున్నది. కావున నీవు కుదుట బెట్టుకొనుము.' అని బోధించిరి.

శాక్యశ్రామణకుని సేవ సేదతీర్ప వసంతసేన 'నా వేశ్యభావమునకు తగినపనియే జరిగినది. కాని చావ నైతిని' అని దుఃఖించి ప్రాణదాత! తా మెవ్వరు? అని ప్రశ్నించి యతడు సంవాహకుడని తెలిసికొనెను సంవాహకుడు 'అమ్మా! ఈతీగె పట్టుకొనుము. నే నీకొన పట్టుకొని మీ యింటి యొద్ద మిమ్ము దిగబెట్టెదను' అని పల్కియు, వసంతసేన చారుదత్త గృహమునకు పోగోరుటచే నక్కడకే దారితీసెను. రాజ మార్గమున పోవుచు వధ్యస్థానము నందలి కోలాహలము విని యిది యేమి? యని తలపోయుచుండ చండాలురు డిండిమము మ్రోగించి చారుదత్త దోషమును మరల నుద్ఘోషించిరి. వసంతసేన యాఘోషణము విని 'ఆర్య! త్వరపడుము. ఆర్య చారుదత్తుని రక్షింపవలయును' అని భిక్షుని హెచ్చరించి తడబడు చరణములతో పరుగెత్త నారంభించెను. భిక్షుకుడు గుమిగూడినజనుల నొత్తగించుచు ముందు పోవుచుండెను. తలారి వీరకుడు ఖడ్గము లాగి ప్రహరింప నుద్యమించినంత ఖడ్గము హస్తమునుండి జారపడెను అప్పు డతడు 'గట్టిగ పట్టికొనినను ఈఖడ్గ మేల క్రింద పడినది? ఆర్య చారుదత్తుడు వధింపబడ డని యూహింతును. ఓ భగవతి! సహ్యవాహినీ! ఆర్య చారుదత్తుడు ముక్తుడైన మా చండాలకుల మనుగ్రహింప బడినట్లు' అని భగవతికి మ్రొక్కెను. రాజాజ్ఞ నెరవేర్ప వలయును. గాన మరల యత్నింతు నని వీరకుడు తలచుచుండ వసంతసేన 'అయ్యా! చంపకుడు చంపకుడు. దురదృష్ట వంతురాలను వచ్చితిని' అని

ఱుచుచు చారుదత్తుని పాదములపై బడినది. చండాలురు వసంతసేనను గుర్తించి 'వసంతసేన జీవించియే యున్నది. అదృష్టవశమున బ్రహ్మహత్యా పాతకము తగుల లేదు. ఈవృత్తాంతముమహారాజునకు విన్నవింపము.' అని సస్పదము హెచ్చరించుకొని నిష్క్రమించిరి. శకారుడు 'అయ్యో!కొంప మునిగినది. ఈమె వసంతసేన. పారిపోవుదును'అని భయముతో పరుగెత్తజొచ్చెను. చారుదత్తుడు 'కత్తిమాసి నఱుక సిద్ధముగా నుండగా ఎండినచేనుపై ద్రోణవృష్టి పడినట్లు వధ కంత రాయము కలిగించిన యీమె యెవ్వతె! (చూచి) స్వర్గమునుండి నన్ను రక్షింప దిగివచ్చిన వసంతసేనా యేమి ? నా మనో భ్రమణమా? కాక వసంతసేన యాకారము ధరించి ఏదేవత యైన దిగి వచ్చెనా?' అని సంశయించుచుండ వసంతసేన యేడ్చుచు 'ఆర్య చారుదత్త! నేను వసంతసేనను' అని గద్గద స్వరమున పలికెను. ఆ సమయముననే జనులందరు 'వసంతసేన బ్రతికియున్నద'ని కోలాహల మొనర్చిరి. చారుదత్తుడు వెంటనే లేచి స్పర్శసుఖ మభినయించి నిమీలితాక్షుడై సంతోష వశమున మాటలు తడబడ "ప్రేయసీ! వసంతసేనా! పయో ధరముల బాష్పాంబురాశిచే తడుపుచు నా మరణమును దప్పింప దేవతవలె నరుదెంచితివి. నీకై చంపబడుచున్న నన్ను నీవే రక్షించుకొంటివి. ఇప్పటి సంగమము విలువ తెలుప జాలను. రక్తవస్త్ర మదియే. మాలయు నదియే, కాని ప్రియా సమాగమమున పెండ్లికొడుకుకళ తెచ్చినది. వధ్యపటహధ్వను లే మంగళధ్వనులైనవి"అని పల్కెను. వసంతసేన తన వృత్తాంత మంతయు నెఱింగించి భిక్షు వెవ్వడని చారుదత్తుడు ప్రశ్నింప యతని వృత్తాంతము చెప్పుచుండెను.

శర్విలకుడు "దుర్మార్గుడగు పాలకుని జంపి ఆతని రాజ్యమున నార్యకుని నభిషిక్తుం జేసితిని. అతని యాజ్ఞ శిరసావహించి చారుదత్త మహాశయుని ముక్తుని జేయ బోవు చుంటిని. (ముందుకుపోయి) ఈ జన సమూహ మేమి? ఆర్య కుని ప్రయత్నము సఫలము కాదా యేమి? (ముందుజూచి) అదృష్టవశమున వసంతసేనతో ఆర్య చారుదత్తుడు జీవించి యున్నాడు. మా మనోరథములు పూర్ణమైనవి" అని బద్దాం జలియై చారుదత్తున కభివాదన మొనర్చెను. "అయ్యా! తా మెవ్వర"ని చారుదత్తుడు ప్రశ్నింప 'ఆర్యుడా! నిక్షేప మగు సువర్ణ భాండమును తమ యింటినుండి దొంగిలిన శర్విలకుడను తమ శకట మధిరోహించి, తమ్ము శరణు పొందిన యార్యకుడు యజ్ఞవాటికయం దున్న పాలకుని జంపి రాజ్య మాక్రమించెను. వెనువెంటనే వేణాతీరమున నున్న కుశావతియందు రాజ్యము తమకు ధారాదత్త మొనర్చి ఇది యంతయు యుష్మద్గుణో పార్జిత మగు రాజ్యమని చెప్పుమనెను. అని వృత్తాంతమంతయు నెఱిగించి శకారుని కట్టితెండని చండాలుర నాజ్ఞాపించెను. వారును మాటలోన శకారుని బంధించి యెదుట నిల్పిరి. తనకేమియు దిక్కులేక పిరికిపడుచు శకారుడు చారుదత్తుని పాదములపై బడి రక్షింప ప్రార్థించెను. శర్విలకుడు "ఆర్య చారుదత్త! ఆజ్ఞ యిండు. వీనిని బంధించి కుక్కలచే కరపింపమా? శూల మారోపింపమా? రంపము లచే కోయింపమా?" అని నుడువ 'నే జెప్పినట్లు చేయుదురా' యని చారుదత్తుడు ప్రశ్నింప శర్విలకుడు 'సందేహ మే'మని పల్కెను, జను లీతని వధింపుడని కోలాహలము మొనర్పదొడగిరి. చారుదత్తుడు కోలాహలమును మాన్పి 'శత్రుస్థానము నందున్న

భక్షింపరాదు. ఈతని వదలివేయుడ'ని యాజ్ఞాపింప శర్విలకు డాతని విడిచి పుచ్చెను.

'ఆర్య చారుదత్తుని వధువు పూజ్యురాలు ధూతాంబ వస్త్రాంచలముగాగు ముద్దుకొమరుని మాసినుగా త్రోయుచు పౌరులు కన్నీళ్ళు కాల్వలుగట్ట నివారించు చున్నను వినక అగ్ని ప్రవేశ మొనర్చు చున్న దను కోలాహలము దూరమున బయల్వెడలెను. చందనకుడు వేగముగ నిట్టూర్పులు పుచ్చుచు పరుగెత్తి వచ్చి 'అయ్యా! త్వరపడుడు. ఆర్య చారుదత్తుడు జీవించె నని చెప్పిన ఎవ్వరును విశ్వసింప కుండిరి.' అనిపల్కి-ధూతాంబా వృత్తాంతమును విన్నవి చెను. కర్ణకఠోర మగు నీ వార్తకు చారుదత్తుడు తాళజాలక 'ఓ చారుచరితా! నీ చరితములు మహీతలమిత్తి సహాయములు కావు. అయినను ఓ పతివ్రతా! భర్తను విడచిపోయి పరలోక సుఖమున కరుగ దగునా?' యని వాపోవుచు మూర్ఛిల్లెను. శర్విలకాదులు సేద దీర్ప చారుదత్తుడు తెప్పరిల్లి అందరితో గృహాభిముఖముగ పరుగెత్తెను.

'నాయనా! నన్ను చితారోహణ మొనర్ప నిమ్ము. మీ నాయనగారు మృతిబొందిరను దుర్వార్త వాక్యము వినరాదు.' అని పలుక అమ్మా! నీవు లేక నేను జీవింపజాల నని బాలు డేడ్చుచుండెను. వృద్ధవనితలు, చెలికత్తెలు, ఒంటరిగా చితినెక్కుట పాపమని చెప్పినను వినక రదనికా మైత్రేయులను బాలుని తీసుకొండని ధూతాంబ ప్రార్థించు చుండెను. చారుదత్తుడు ముందుకు వచ్చి నేనే బాలునెత్తి కొందుననిపల్కి-గాఢాలింగన మొనర్చుకొనెను. ధూతాంబ సర్వమును గుర్తించి వెనుదిరిగి ప్రాణప్రియుని వీక్షించి

సంతోషపరవశయై ప్రాణప్రియ నాశ్లేష మొనర్చెను. ప్రేయసీ ప్రియులు ఆలింగనమున మైమఱచియుండ శర్విలకుడు పరమానంద సంభరితు డయ్యెను. మైత్రేయుడు 'ఈకన్నుల తోడనే నా ప్రియవయస్యుని చూచుచున్నాను. సతీ పతిభావము ప్రియుని బతికించుకొన్నది. ప్రియవయస్యుడా! చిరంజీవివై వర్ధిలుము' అని ఆశీర్వదించి యానందమున గంతులువైచెను. 'చెల్లీ! నాయదృష్టమున చూడగల్గితిని.' అనిపల్కి- ధూతాంబ వసంతసేనను కౌగిలించుకొనెను.

చారుదత్తుడు 'భిక్షూ! నీ కేమి ప్రియము'ని యడిగిన ''ఆర్య! ఇట్టి యనిత్యత్వమును కండ్లార గాంచి ప్రవ్రజ్యమున స్థిరచిత్తుడ నైతిని. నాకిం కేమియు వలదని పలుకగా చారుదత్తుడు బౌద్ధవిహారముల కాతనిని కులపతి గావించెను. స్థావరకుని దాస్యము తొలంగించెను. చండాలుర కిర్వురకు స్థలాధిపత్య మొసంగి గౌరవించెను. చందనకునకు పృథ్వీదండపాలకత్వ మొసంగెను. శకారుని పూర్వస్థానమున నియోగించెను. శర్విలకాదులు శకారుని చంపవలయునని పట్టుబట్టగా శరణు వేడిన శత్రువును పరాభవింప రాదని పల్కి వారిని సమాధానపఱచెను.

చారుదత్తుడు ''నాకింతకంటె కావలసిన దేమి? చారిత్రము విశుద్ధ మైనది. శత్రువుల సమూలముగ బరిమార్చితిని. ఈ శత్రువు పదదాసు డయ్యెను. వసంతసేనయు ధూతాంబయు కన్నుల పండువుగ గన్పడుచుండిరి. ఐశ్వర్యము ద్విగుణ మయ్యెను'' అని సంతసించెను. పౌరులందరు చారుదత్తుని శుభ పరిణామమునకు ఆనంద కందళిత హృదయులై తమతమ గృహముల కరిగిరి. పరిపాలనము జనానంద కరముగ

నుండెను. చారుదత్తుని పరిజలు వేనోళ్ళ శ్లాఘించుచు శాలుక కాతని చరిత్రము కథలుగ జెప్పుకొనుచున్నారు.

# ప్రభావతి

## ఆవేదనము

'త్రిలోకాధిపా! దేవర కనుదామరలకును నింత వెలుగుగొలిపెడి నీ ద్వారకానగర సౌందర్య మతిలోకము గదా! పశ్చిమమున వనధియు, కడమ దిశల వనచయంబును నగరరామణీయకమును ద్విగుణ మొనర్చుచున్నవి. హర్మ్యాగ్ర కేతువులు అవచూడోపల దీప్తి శబలములు కెంపుల వేడ్క లెంత కనువిందుగ నున్నవి. శృంగారోద్యాన సౌందర్యమును తిలకింపుడు. అది కలధౌత కేళీనగము. దాని పొంత నున్న కొలను ఫుల్ల కహ్లార సుందరము. హరినీల సోపాన పంక్తి ఎంత వింత తళుకు కూర్చినది. అవి చాంపేయ పుష్పములు. ఎంత పచ్చగ నున్నవి? అవే పూదేనియ సోనకాలువలు' అని పుర రామణీయకమును మాతలి వర్ణింప వాసవుడు సహస్ర లోచనముల సౌందర్యపాన మొనర్చుచు చనిచని కొంత దవ్వున భూమికి డిగ్గి సాత్యకి ప్రత్యుత్థాన మొనర్ప కక్ష్యాంత రంబులు గడచి వాసుదేవ మందిరము చేర నరిగెను. కృష్ణుడు యథోచితముగ ఆదరించి కుశలప్రశ్నంబు గావించెను. అంత నిందుడి ట్లు విన్నవించెను. 'కృష్ణా! నీ వెఱుగని దేమున్నది? నాచే విన నధిమాత్ర మయ్యెను. గాన వినిపించెదను. వజ్రనాభు డను రాక్షసుడు ఘోరతప మొనర్చి బ్రహ్మను ప్రసన్నుని జేసెను. చతురాననుడు మెచ్చి మేగువసా న నభీష్టమును

నిర్మించి యిచ్చెను. వజ్రనాభుని యనుమతి లేక యం దెవ్వరును ప్రవేశింపలేరు. వర మదాంధుడగు వజ్రనాభుడు స్వర్గముపై దాడి చేసి ప్రాణాందముగ పెంచుకున్న నందనవనిలో సేనల విడియించెను. వారిపోతర మేమి చెప్పను ? కల్పవృక్షముల విరుగ గొట్టిరి. ఎండిన పాశిన మనుష్య మాంసములు సంతానకములకు వ్రేల గట్టిరి. హరిచందనముల గంధగజముల బంధించిరి. మందార తతులపై మురిన వస్త్రముల నారవైచిరి. అప్పటి వజ్రనాభుని దౌష్ట్యము తంపరానిది. దేవత లెవ్వరు నెదిరించి గెల్వజాలరను నజ్ఞాసను వరము వాని కింత పొగరు తెచ్చినది. నేనును బృహస్పతియు కొంత చింతించి అక్కసెలి యుండరి సంతానమగు మనకు ఇంత దుస్వత్సర మేల ? పొంది పొసగి మను టొప్పునని చెప్ప నెంచితిమి. చుట్టరికము నెంపుచు పట్టణములోనికి రప్పించి వారికి వారి సేనలకు విడుదు లేర్పాటు గావించితిమి. అపుడు నే బడ్డ పాటులు చెప్పదరము కాదు. కానుక చాలదని మిట్టిపడు వానికి, నా పిడికికి రంభ నంపవైచేల నని తిట్టువానికిని కేలు మొగిచితిని. నన్ను గుండేల పూజింప లేదన్న నన్ను సప్పు లిచ్చితిని. అమృతము పోయుమనువాని లాలించితిని. ఇంత చేసినను కృతఘ్నుడగు నావజ్రనాభుడు మొసళ్ళవంటి రక్కసుల వెంట నిడుకొని గొలువు కూటమున కేతెంచెను. అతని యనుచరులు మునిముఖ్యుల పెడతెక్కలు కట్టిలాగి గుర్రాలవలె పడవైచి ఆసనముల నాసీనులయిరి. ఔ గాకన లేకపోతిని. నన్ను చుట్టు ముట్టిన దిక్కేమి యని దిగులు పుట్టెను. కొంతవడికి తెప్పరిల్లి లేని గాంభీర్యము తెచ్చుకొని వస్త్రాభరణాదుల నిచ్చి గౌరవింపుడని సేవకుల కాజ్ఞ యిచ్చితిని. అంతట వజ్రనాభుడు చాలు

చాలని వారించి 'ఇంద్రా! దివ్యవస్తువుల నిచ్చువచ్చినట్లును భరించుహక్కు మాకును గలదు. నీవిచ్చుదగకు నెదురు చూచు దైన్యము మాకేల ? నీ మంచితనపు నటనల మోస పోతిమి. వృథామాధుర్యము మాని న్యాయము వినుము. సురాసురులు కశ్యప సంతతివారు. కాన నీ వేలినంతకాలము స్వర్గ మేలు హక్కు మాకును గలదు. రాజ్యము విడిచి పొమ్ము పోకుంటివా వాటియింటి కుందేల వగు నిన్నిప్పుడే బంధించెదను' అని పల్కెను. అంత నేను నవ్వుచు 'తమ్ముడా! నిగ్రహముల కేమి? పెద్దలు కలరు గదా. జనకు లగు కశ్యప మహామునీంద్రులు చెప్పినట్లు నడచు కొందుము. తొలుత మద్వచనంబులు విని యిప్పుడిట్లు చేయుట తగదు. తియ్యని నోరం జేదు మేయుట తగవే యని పల్కి యా దానవుని వెంట నిడుకొని కశ్యప మునీంద్రుని దర్శించితిని. యజ్ఞదీక్షితు డగు నా మహాముని 'యజనావసానమున తగవు తీర్తును వజ్రనాభా ! అంత దనుక నీవు వజ్రపురమునను బొమ్మ'ని యాజ్ఞాపించెను. నా యదృష్టమున వాడంగీకరించెను. అయిన నేమి ? ఏమరించి ఎప్పుడు పైబడునో ఎవ్వ డెఱుగును? నంద నందనా ! రాజ్యసుఖాశ ఎన్నడో విడచితిని నీవు నలబింకగ నర్థము పోసినను అనుగటు పెట్టను నిరసించు చుండెదను.

కృష్ణుడీపలుకులు విని కర్ణంబులు మూసికొని 'దేవత కులాధిపా! ఎంతమాట యాడితివి. పాపి దప్పదగునా ? కడలు బండ్లవచ్చును. బండ్లోడల వచ్చును. పూర్వులు బలాధికు లగురక్కసులు లెందరు తుళ్ళిపోరు? తుదకు వారేమయిరి ? నీకికని కాలము సమీపించినది సత్పురుషులచిత్తము నొచ్చిన రిత్తపోవనుసుమా. మా జనకులు యాగ మొక్కటి ప్రారం

భింప నుండిరి. అదియును నీకు మేలు కూర్చును. గదా! యాగము సమాప్తమైనంతనే దుష్టరాక్షసుని సాధింప యత్నించెదను. నీవును ఉపాయము వెదుకు మంటమును. అది అల్ప కార్యముకాదు' అని పలికి ఇంద్రుని వీడ్కొలిపెను.

## యాగము

వసుదేవు డొనరించుయజ్ఞ మపూర్వముగ నుండెను. నిఖిల దేశములనుండి యరుదెంచిన రాజులు భక్తియుక్తులై కానుక లర్పించిరి. హవ్యద్రవ్య సంభృతానలములు ప్రదక్షిణముగ నర్చులు వెలార్చినవి. సాన్నాయ్య సౌరభసంపదచే పూతములను పరిమితములును నగు పిల్లవాయువులు జనుల కమందానందము కలిగించినవి. హోమధూమము ఆకసమున తొలికారుమబ్బుల నేర్పరచెను. అవభృథస్నానమున నంద ఱును ధన్యుల మని తలచిరి. నారాయణ నామస్మరణముననే తపోయజ్ఞ క్రియాలు అక్షయ్యఫలముల నొసంగుచుండ నాది పూరుషుడు ప్రత్యక్షాకారమున నున్న యజ్ఞము ప్రాశస్త్యమే మని పొగడవచ్చునని యందఱు వినుతించిరి. ఆయజ్ఞమున నసంతృప్తుడు మచ్చునకైనరా డయ్యెను.

అత్తఱి భద్రనటు డను నటుడు నర్తన ప్రావీణ్యమున సభాసదుల నానందాబ్ధి నోలలాడించెను. మును లానటునికి వరములిచ్చి, గౌరవించిరి. ఇతరు లాభరణములను వస్త్రములను పారితోషికముగా నొసంగిరి. భద్రనటుడు వారంఱను వేఱు వేఱు పొగడ దొడగెను. కొందఱు ధూర్తవటువులు చిలిపి నవ్వులు నవ్వుచు దండముల గట్టియున్న పచ్చని కౌపీనములు వానిపై వైచి 'ఓ భద్రనటా! పొగడుడు' మని యిట్టి తెగడ

చూపితి' మని పల్కిరి. అంత నా భద్రినటుడు కౌపీనము లెగురవైచి పట్టుకొనుచు నోహోయని నవ్వుచు నిట్లు నుతించెను. 'మీరు వేదసౌరభములు వెదజల్లగల బ్రాహ్మణజాతి కోరకములరు. ఇంత వా రయ్యు బ్రహ్మశిఖ ముట్టుప్రౌఢులరు. దంటమాటలకు ధౌర్త్యమునకు పేరుగన్న ప్రాజ్ఞులరు. వెన్నుని వామనత్వ మభినయించు నో తండ్రులారా! మీ యనుగ్రహము మాకన్ని కార్యముల జయము నొడకూర్చును.

ఈ పొగడ్తకు వటువులు కసువుబ్బ నవ్వుచు 'పొగడ్త యన్న నిట్టి యబద్ధములుకావు. మాకు సంతోషము కలుగలేదు. ఇచ్చినవి మఱల పుచ్చుకొనరాదు. పుచ్చుకొనక పోవనురాదు' అని పలికి యాతని జుట్టు ముట్టిరి. అంత నటుడు నగవును కోపంబును మోమున గదుర మేళగాండ్రతో "ఓరీ! ఈ వటువులు మనవాలకపు సొమ్ములందు నేదేని ముచ్చిలింప వేచియున్నట్లున్నది. ఈ ముచ్చుల గనిపెట్టి యుండు" డని పలికెను. వటువులు నటుని పలుకులకు కనుబొమలు ముడివడ, పెదవులదర 'మేము ముచ్చులమా? మీ బోంట్లె ముచ్చుదనములకు పుట్టినిండ్లు. ఆటగాండ్రని పుర ప్రవేశమున కనుమతింపగ పురప్రవేశ మొనర్చి, పగలు క్రీడావిశేషములతో జనుల భ్రమియింప జేసెదరు. సందుగొందుల రహస్యములు మూలమట్టముగ నెఱిగి రాత్రులకన్నము దొంగ లగుదురు. ఎట్టివా రడ్డమైనను వారి నశ్రమమున నోడించి పనుగ్రిక్కిన పాటిగా నిష్టార్థము లెల్లను సంగ్రహింతురు. ఇది మీ స్వభావము. ఇది మీమోమున బ్రహ్మ మూడు పంక్తుల వ్రాసిన యదార్థము' అని పల్కిరి.

ఈ సంభాషణ నడచు సమయమున నందనందనుడు వాసవకార్యము నెరవేర్చు టెట్లని యాలోచించు చుండెను. ధూర్తవటువుల పల్కులు వజ్రపుర ప్రవేశమునకు నుపాయము నుపదేశించినవని యాతడు సంతసించెను. వజ్రపురము ప్రవేశించి యా లోకకంటకు నున్మూలింప నర్హుడెవడని యాతడు తీవ్రముగ నాలోచింప నారంభించెను.

## శు చి ము ఖి

దేవేంద్రుడు కృష్ణుని వచనము ననుసరించి స్వర్గమున కరిగి నప్పటినుండియు దనుజా పాయమున కుపాయ మన్వేషించు చుండెను. ఒకనా డతడు దేవశైవలినీ విహారమున పెంపెసగు రాయంచల రావించి గారవంబున నిట్లు పలికెను.

“ఓ రాయంచలారా! మాకొకపని గలిగి మిమ్ము పిలిపించితిమి. మీ చేత నగు కార్యము మీ రొనర్చుట గదా మీ ధర్మము. వజ్రనాభుడు మమ్ము పెట్టెడి కష్టములు మీకును తెలిసినవే. ఇపుడు వాని వినాశమునకు తీవ్రమగు యత్న మొనర్చు చుంటిమి. ఇది కడుంగడు రహస్యము. మాకన్న ముందుగ వాడే మాచరించునో యెఱుగక తల్లడిల్లు చుంటిమి. మీ రాపురమునకు రాకపోక లొనర్చుచున్న మాకు వేగు నడుప వలయును. ఈ వేగు నడుపుట కన్యులు సమర్థులు కారు. పరును వాని యనుమతి లేక పురప్రవేశ మొనర్ప జాలరు. మిమ్మాతడు నివారింప జాలడు. కేళీదీర్ఘికలలో మీరు విహరింప నేత్రానందముగ నెవ్వడైన వీక్షింప గోరును. మీ విహారములు కొలంకులకు నలంకారములు కావున కాదనక మామాటల నెరవేర్చునది” అంత శుచి

ముఖీవల్లభుడగు రాయుంచ ఇంద్రునెదుట నిలిచి వినయముగాని మితగాత్రమున 'ఓపులోమజావల్లభా! ఆవజ్రనాభుడు ప్రభుత్వ గర్వమున కన్నును మిన్నును గానకుండెను. వాని స్థితి పరిశీంచిన నా తామసు డెన్నటికిని నెత్తిరాడని తోచుచున్నది. అయినను ప్రభువులు కార్యముపట్ల ఏమఱగుంపవలది. ఇప్పుడే మేముకొందఱ మూ వజ్రపురమునుండి వచ్చితిమి. చూచినది తలచినదియు విన్నవించితిని. నాథా! శుచిముఖి వానియందలి దాదాపు తుదకు వచ్చినదని తెలియజేసినది. ఆ విశేషమంతయు నాజాయ విన్నవించును. ప్రభువులు కోరుదో శుచిముఖిని కానిపింతునని పలికి యిందుని యానతిచే తనముగువను పిలిపించెను. ప్రభువులకు గర్వము వినపింపు మని మగడు హెచ్చరింప శుచిముఖి శతముఖున కభిముఖయై యిట్లు విన్నవించెను.

"ప్రభూ! మేము చాలాకాలమునుండి కడుపు కక్కుర్తిచే వజ్రపురమునకు రాకపోకలు జరుపుచుంటిమి. ఇది మూ యెడ గల తప్పు. పరలము. క్షమింపుము. ఏమి చేయుదుము. అంచటికి పోక మూమేత యెట్లు నడచును? గగనస్రవంతిలో సువర్ణాబ్జముల నాతడే హరించెను. వాని దౌర్జన్యమునకు మానస సరోవరము గురి యయినది. బిందుసరమున మచ్చునకైన పద్మము లేకుండ జేసెను. సౌగంధిక కాసారామున నీరు మాత్రమే మిగిలినది. కనక నలినములకు నేను వజ్రపురములోనికి దీర్ఘిక లేతావులు. కావున మేము వజ్రపురములోని కొలంకులను, కేళీకూపములను, బొడ్డన బావులను స్వేచ్ఛగ విహరించుట కాతని యనుజ్ఞ పడసితిమి. అట్లు స్వేచ్ఛావిహారములు సలుపుచు నిన్న నొక విశేషము గంటిని. కన్య

శోణితపురము పరిసరముల దివ్యమగు కొలను గలదు. తత్తీర దేశమున క్రొత్త విరిగుత్తి మొత్తముల నలరారు పొదరింటిలో తన చెలితో సంభాషణ మొనర్చు నొక దివ్య కన్యను గాంచ గలిగితిని. ఆమె 'కమల దళాక్షిరో! నే డొక కల గాంచితిని. లోకమున కన్నదియు విన్నదియు గాదు. తలచిన మేను పులకించు చున్నది. కొంత నిజము. కొంత స్వప్నము' అని పల్కునప్పటికి నునుసిగ్గు దొంతర లాకుసుమ కోమలిని పైకొనినవి. అంత చెలికత్తె 'ఎట్టిరహస్యమైన దాపనని యొట్టిడు కొంటివి గదా! మన కెన్నడైన నిట్టి యరమరలు గలవా' యని నిర్బంధ మొనర్ప సకలంకమగు స్నేహభావమున నా ముద్దియ యిట్లు పల్కెను. 'గిరిజ యగు పరమేశ్వరి చిరునవ్వులు చిందులు ద్రొక్క స్వప్నమున సాక్షాత్కరించి ప్రేమతో నన్ను చేరపిలిచినది. పిలిచి ఒక కేల నా యొడలు నిమురుచు నీకొక్క మగనిని కూర్చితిని చూడుమని చిత్రఫలక మిచ్చినది. అది యామె కొనివచ్చినది కాదు. తలచినంతనే చిత్రఫలక మామె హస్తము నలంకరించెను. చూచు చుండగనే యొక సుకుమారుని చిత్రము గీచినది. అబ్బా! ఏమి రూపము? ఆ లావణ్యము పొంకము, ఆ గాంభీర్యము సొగసు, ఆ మూర్తిభవించిన శౌర్యము తలచిన మేను చెమర్చును. నూనూగు మీసముల ప్రాయపువాడే! అంత నా గిరిజ 'ఇతడు ప్రద్యుమ్నుడను రాజపుత్రుడు. నీ విభుడు. మీ కిర్వురకు జనించు పుత్రి దీపురము నేలును' అని పలికినది. అంత కలలో గల పెద్దలు వివశనగు నాచే నా దేవికి నమస్కరింప జేసిరి. చెలీ ఇది యేమి చిత్రము. చిత్రము నా చేత నున్నదే' అని. నేను నికటంబున నుండి యీ వృత్తాంతము వింటిని. కావున వజ్రనాభుని

యనురాగంబు తీరు చూచిన ప్రద్యుమ్నున్నా నయనమునకు అచిరముననే యత్నము జరుగు నని తోచు చున్నది. ఆ యత్నము తమ కార్యమున కుపకారకము' గదా.

శుచిముఖి పల్కిన అమృతమధురములగు తేనెపల్కులు తన చిత్తంబునకు క్రొత్త యింపుసొంపు సంపాదింప సహస్రాక్షుడు 'శబ్దసంస్కార సుపూర్ణముగ నున్నది. శాఖాచక్రి మారణముకాని పుపరుక్తిగాని గలుగవు. భావము గంభీరము ఎంత బాగుగ వచించితివి. ఓవరటామణీ! నీ కెవ్వరి కొలదియు గావు. వాగ్దేవతవో, ఆమె దిద్దిన కవితవో యైయుందువు' అని మెచ్చుకొనగా, శుచిముఖి సురేంద్ర! తమపలుకుల కన్యథాత్వము లేదు? పద్మజుని తేరు లాగు సారంభరుషు మాతంజి. పూజ్యురాలు సరస్వతి నన్ను పెంచి విద్య శిక్షించినది.' అని తన చరిత్ర మెరిగింప వాసవుడు 'కాకున్న నీ కింత సామర్థ్య మబ్బు టెట్లు? వ్యాకులపాటున త్రోవ గానక యున్న మాకు మా పాలిటి భాగ్యదేవత నిన్ను ననుగ్రహించినది. దేవ కార్యము తుది ముట్ట దీర్చుటకు నీ కంటె నర్హులు లేరు. నీ తోడి యంచలతో వజ్రపురమునకు బోయి ప్రభావతితో చెలిమి సంపాదించుము. సంపాదించి ప్రద్యుమ్ను నం దను రాగము బలియునట్లు నీ నేర్పు చూపి యత్నింపుము. తొలు దొల్త ద్వారక కరిగి నీ పూనిక నెల్ల యాతనికి విన్నవించి యాతని యాదరము బడయుము. అతనిబుద్ధి మనకు శ్రేయో దాయకము, ఇది శుచిముఖీ! యాజ్ఞ కాదు ప్రార్థన, ఓ తక్కుంగల హంసలారా! ఈమె యాజ్ఞ మీ రందరు శిరసావహించి మెలగుడు' అని పల్కి మరాళ చక్రమును వీడ్కొలిపెను.

శుచిముఖి చకోరింగ చక్రియును వెంట నిడ్కొని ఇందుని పనుపున ద్వారకా నగరమునకు పయన మయ్యెను. “పక్షికులము ద్వారక చేరునప్పటికి వసుదేవనందనుడు ఆలయమున నున్న ఉపవనమునందలి సరస్తీర మంటపమును అష్ట మహిషీ సమేతుడై యలంకరించి యుండెను. శుచిముఖి యా యనఘుని దవ్వులనె చూచినది ఖగకులముతో నూత్నవిలాసములు తనుకులు జిమ్మ సరోవరములో దిగినది. అనంతరము తానొక్కతియ కదలి భార్య లందఱు సేవింప మెఱుగుల తోడి కార్మొగులువలె నున్న కృష్ణుని చెంతకు బెదురులేక యారిగినది. ఇంద్రుడు తమకొక్కమాట విన్నవింపుమని నన్ను బనిచె నని పల్కినది. ఈ దిట్టతనమునకు ఉవిద లందఱు అశ్చెరువు బొందిరి. కృష్ణుడు హంసాంగన మాట నేర్పునకు బుద్ధి కళాకౌశలమునకు నాత్మ మెచ్చుకొనుచు లేచి నిల్చి జాంబవతీకరమున నున్న నాగవల్లి దళములు పుచ్చుకొన్నంత ఉవిద లెల్లరు దూరముగా నరిగిరి. గోవిందు డిచ్చిన చనువునకు శుచిముఖి కేలుదోయి మోడ్చి తనకును ఇందునకును జరిగిన సంభాషణ మంతయు పూసగ్రుచ్చినట్లు వినిపించెను. వటువుల పల్కుల నుపశ్రుతిగ గైకొని తాను నిశ్చయము చేసుకొన్న దానికి ఇది సరిదాకుటచే కృష్ణుడు సంతసిల్లెను. కొంతవడికి శుచిముఖితో ప్రద్యుమ్నుడు బలవిభవమున మిన్న. శౌర్యమున దిట్ట రాక్షసులకన్న మిన్నగ మాయలు నేర్చిన వాడు. నీపలుకల చందము పరిశీలించిన నవశ్యము కార్యసిద్ధి కా గలదని తోచుచున్నది. ఆ రాక్షసుని పట్టణము వజ్రనాభుని యనుజ్ఞలేక ఎవ్వరును చొరరాదట. మాజనకుల యజ్ఞమునకు భద్రనటు డను వా డొకడు వచ్చి నాట్యచాతుర్యమున ముని

సభను ముగ్ధ మొనర్చి అవధ్యత్వము, సప్తద్వీప గమనము, ఆకాశగతి నాట్యసమయముల కామరూప ధారణము వరములుగ గైకొనెను. వాడిప్పుడు ఏక పీఠమును ఆటపసనెఱపుచు తిరుగుచున్నాఁడు. నీవు భద్రనటునకు పురప్రవేశ మొనర్ప ఆజ్ఞ గైకొనుము. ఆ రూపుతాల్చి ప్రద్యుమ్నుడు వజ్రపురము ప్రవేశించి కార్యసిద్ధి జేయును. అనంతర కృత్యంబులు నీవ యెఱుంగుదువు. పొమ్మ' అని వీడ్కొలిపెను. అంత శుచిముఖి తోడిపక్షులతో వజ్రపురాభిముఖముగ పయన మయ్యెను.

# ప్రద్యుమ్నుడు

రుక్మిణీ యనుంగు బుత్త్రుడు ప్రద్యుమ్నుడు అశ్వారూఢుడై ద్వారకానగర బాహ్యప్రదేశమునకు వాహ్యాళి కేగెను.

ఆతడు తురగమును ముందుకు, వెనకకు, పార్శ్వభాగములకు పరుగెత్తించుచు కనక దండమున కందుకమును గొట్టి ఆకాశమునకె త్రిప్పుచు కొంతతడవు క్రీడించెను. కందుకమును ముందుకు వేగముగ పారవైచి, అది క్రిందపడక పూర్వమె కనక దండమున పైకిగొట్టుచు హయగతి చిత్రముగ గొంతతడవు క్రీడించెను. ఇట్లు కందుకక్రీడ సల్పి హయమును చక్రగతికి ద్రిప్పెను. గతివేగము నధికమించిన కొలదియు అశ్వము చిత్రముగ గన్పట్టెను. తొలుదొల్త స్పష్టముగ గోచరించిన తురగము సరూపాశ్వాలివలె గన్పట్టెను. కొంత వడికి అనతి స్ఫుటావయవ మయ్యెను. మఱికొంత వడికి అశ్వము కన్పడలేదు. తద్విభూషణరాజ మాత్రము కొఱవి

తిప్పినట్లు తోఁచెను. కొంత తడవిట్లు క్రీడించి నానాగతి భేదములచే నశ్వము నలయించెను.

ఇట్లు క్రీడా కలాపమున ప్రద్యుమ్నుడు సంతృప్తుడై అంకవన్నెను సాహిణి యవ్వల నూదిపట్టగా, చెలికాడు కైదండ యొసఁగుచుండ హయముడిగ్గెను. ప్రజలు వస్త్రములను, మణులను దిగదుడిచిరి.

ఆ సమయమున ఆకాశవీధి జనుచుండిన శుచిముఖి 'ఇతఁ డితండ కావలయు. అవశ్య మీ వర పురుషునితో మాట్లాడి చనఁగవలయు' నని తోడిఖగములతోఁ బలికెను. ప్రద్యుమ్నుఁ డాపల్కులువిని వెఱఁగందెను. అంత నా పక్షిగణము కనక రేఖలతోడి ఱెక్కల నునుగాంతి సొంపులు గులుకరింప, చూపఱులకు నింపు నింపుచు భూమికి డిగ్గెను. ప్రద్యుమ్నుడు కౌతుకముతోఁ బక్షుల జేర నరిగి "తొలుత నితనితో మాటాడవలయు" నను కొంటిరి. ఎవనితో పల్కవలయునో వానిం బిలిచి సంభాషింపుడు. కార్యగౌరవమున మీఁరు నిలువజాల రని యిట్లు పలికితిని; గాని మీ దర్శమున తనిసి గాదు. రూపచేష్టావచో విశేషముల బరికించిన మీరు ప్రకృతి హంసలు కారు' అని పలుకరించెను. అంత శుచిముఖి మనోహర మగు మృదు మధుర స్వరంబున నిట్లనియెను.

అచ్యుతాత్మజా! ఇచ్చట మఱియెవ్వరితో మాటాడ వచ్చెదము? ఇంద్రునాజ్ఞచే శ్రీకృష్ణునితోఁ బలుకవచ్చితిమి. పల్కులయినవి. వారి యాజ్ఞల నెరవేర్ప నిప్పుడొక వంకకు బోవుచుంటిమి. ఇపుడే నిన్ను జూచితిమి. నీకొలువు చేయుట పోఁడని నిన్ను దర్శించితిమి. యోగ్యసమర్హణ మానుట తప్పగదా! నీయనుగ్రహమే మా కార్యముల నెరవేర్పగలదు.

నీవు పల్కినట్లు మేము దివ్యహంసలము. కాశ్యపులము గాన మీతండ్రియు నింద్రుడును తమపరివారముగా జూతురు. అన్ని కార్యముల శ్రీకృష్ణునకు మీరు దక్షిణ భుజము కాన మాకిదంబు మీకు విన్నవించుకొంటిమి. మేము పోయివచ్చెదము.' ప్రద్యుమ్నుడీ పల్కులువిని 'మీరు పోయెడికార్యము ఎవ్వరికిని చెప్పరాదు గావలయును, పోనిండు. 'అత డితడను కొంటిరి నా ప్రసంగము తొలుత నెట వచ్చినది ? కొలది కాలము ప్రయాణ మాపవచ్చిన ముహూర్తమాత్రము నిలిచి భాషింపుడు' అనికోరెను. 'అవును. అది రహస్యమే. నిమేష మాత్రమును నాగరాదు. అయినను నీకును జనార్దనకును భేదమేమి ? నీప్రసంగ మెచ్చట కలిగెనో వినిపింతును' అని పల్కి శుచిముఖి నలువైపులు వీక్షించినది. ఇంగితజ్ఞుడగు ప్రద్యుమ్నుని వీక్షణము గుర్తించి పరిజనులు దూరముగా తొలగిపోయిరి. అంత సంచచెలువ కలికి పల్కుల 'వజ్రనాభుడను రాక్షసు జంపుటకు మనవారు యత్న మొనర్చుచున్నారు. తమకంటె ముందే వాడు తమపై బడునేమో అని నన్ను వేగ పంపుచున్నారు' అని విన్నవించెను. ప్రద్యుమ్నుడా పల్కులు విని 'అయ్యయ్యో ! మన వారిది దుర్ఘట మని యెంత చింత కావించుచున్నారు. తమ రాజ్ఞయిడినంత నెంత పనైనను మేము తీర్పలేమా ? నన్నొకర్తెని పంపిన అజ్ఞాబల మూతగ నాతనిపీచ మడంపనా ?' అని పలుక శుచిముఖి యచ్చెరువున నతని వీక్షించి యిట్లనెను.

'భిదురధరుడు, చక్రియును ఇంతవిచార మొనర్చుచుండరే ? శత్రువెంత బలియుడో ? అను విచారము లేక 'నన్ను నొక్కని బంపిన త్రుంతునం'టివి. ఈవీరత్వము నీకే

తగును. పిరికికంద లేనివారు తమకుతామై యుద్ధముల రగుల్కొల్పరు; గాని యుద్ధములు తథ్యమైన ఎట్టివారికైన నెదిరింతురుగదా ! మీ ప్రసంగము వచ్చినవిధము వినుము. పూర్వమునుండి మేము వ్రజపురికి రాకపోకలు సలుపుచుంటిమి. ఒకనాడు శుద్ధాంత ప్రాంతముల లతాగృహమున నొకసుందరి వయస్యతో ముచ్చటలాడుచుండ జూచితిని. ఆ సుందరి తిర్యగ్వనిత నగు నాకే అమర్త్యాంగనా శంకను నొనరించెను. ఆ సౌందర్యము వర్ణన కలవి కాదు. కవు లేమేమో వర్ణనలొనర్తురు. నేత్రమ్ములు, క్రొన్నెలలు, శ్రీకారములు అళులు అని వర్ణింపబోయిన సిగ్గు వచ్చును. ఆ సుదతి కురులు నీలిమలో తేటుల నావలకు నెట్టినవి. కావుననే యవి వికచము లగు పుష్పములకు వెదకుచుండును. చెవులు మదనుని విజయలేఖకీవల నావల నున్న శ్రీకారములు. కనుబొమ్మలు శార్ఙ్గలతలు. చంపక నామె నాసికకు లీసి కట్టు. నేత్రములు బేడిసమీలను చీకొట్టుచున్నవి. స్వర మాధుర్యము శుకపికముల నడవుల పాలొనర్చినది అధరము బింబఫలము. అధరము చాటున నున్న పలువరుస చిరుగాలికి గదలియాడు పల్లవము. మాటున నున్న కుందకుసుమల చాలును గుర్తుసు తెచ్చును. కరములు గొజ్జగివిరి రేకుల బంతులు. పాదములు కెందామరలు.కుమారా! ఇదిగో ఇది యిట్టి దని అవయవ సౌందర్యము నిరూపింప మార్గాంతరముదొరకమిచే నిట్టియుపమలు వచించితిని. స్థూలారుంధతీ న్యాయమున నా సుందరి సౌందర్యము భావింపుము. ఆయంగములు ఈ యుపములకన్న వేయి మడుంగులు మిన్నగ నుండును. లోకులు 'వెన్నెల తేటనిగ్గు, పద్మరజ మృదుత్వము మేలిమి బంగారు ధాళధళ్యము కరిగి మన్మథుడు కరువుగట్టి

పోతబోసి యుంచు'నని పల్కుచుందురు. ఈ వర్ణనము గూడ చాలదు. ఎట్లు వర్ణింతమని యత్నించినను సౌందర్యములోని కోటితమాంశము కూడ వర్ణింపలేకపోతిని. నేను అతివాఙ్మహిమాఢ్యనుజుమా! మా యమ్మ సరస్వతి తనంతగ నన్ను దిద్దినది. నా మోము శబ్ద సంస్కార పూత మగుటచే మా యమ్మయే శుచిముఖి యని పేరు పెట్టినది. విద్యలన్నియును నాకు కరతలామలకములు. ఒక నాడు తన పెంపుడు చిలుకను, నన్నును వాదుకు గడిత చెప్పుడని సరస్వతి నియమించినది. అందు నా పలుకులవాసి యామెకు మెచ్చు గొల్పినది. అంత నా రెక్కల నలి నఖాగ్రముల దీర్చుచు వత్సలతయు, ఆదరమును పెనగొన నాకు "ఉపమాతిశయోక్తి కామధేను" బిరుద మిచ్చినది. ఆ బిరుదు చెక్కిన నూపుర మామె నా చరణమునకు దొడిగినది. ఇదియే యనూపురము. నారాయణ నందనా! ఇట్టి నా పలుకులకు గూడ దనుజకన్యారూప సౌందర్య మగమ్యముగ నున్నది. చిత్రఫలకమున వ్రాసి చూపుద మన్నను వ్రాయ నలవి కాదు. ఏయవయవమును భావింపక వ్రాయలేము. భావించిన ఆనంద పారవశ్యము జనించును. ఇంక వ్రాయు టెట్లు ?

ఆ రూపమును చిత్రమున వ్రాయు నేర్పు ఎవ్వనికైన నున్నచో నట్టివనిత నింకొకదానిని బ్రహ్మ సృష్టించి యుండును గదా! నే నొకపరి 'ప్రభావతి యాదిశక్తి సృష్టి'యని బ్రహ్మ వచింపగా వింటిని. ఇపుడది తలపున బారినది. ఆ ప్రభావతికి స్వప్నమున పార్వతి సాక్షాత్కరించి యొక్క చిత్ర మిచ్చెనట. చెలియు ప్రభావతియు ఒక్కచో నా చిత్రము వీక్షించుచుండ నే జూచితిని. అందలి సుందరాకారుని మహనీయాకృతి

నీ యాకృతిని సరిదాకినది. కావున "అతడిత" డను కొంటిమి. "వీరవరా! కాలాతీతమైనది. కార్యభరము నిలువనీయకున్నది. పోయివచ్చెదము సెలవిమ్ము" ఇట్లనుజ్ఞ గైకొని శుచిముఖి అంచలపిండు తన్ను వెంబడింప వజ్రపురమార్గము పట్టెను.

ప్రద్యుమ్నుడు రాయంచచెలువ చెప్పిన విధమున ప్రభావతీ రూపమును మనన మొనర్చుచు చిత్తమున నేర్పడిన భావచిత్రమున భావమును లగ్న మొనర్చెను. కడనున్న వారిని కనకుండెను. కనినచో అన్యావర్తనలు మఱచును. చెప్పినపల్కు చెప్పినగాని వినడు ఎంతయో పోరిన గాని మజ్జ నాదుల నొసర్పడు. చేసినపనులైనను తబ్బిబ్బుగా జేయును. సేవకుల సేవల గైకొనడు. ఇట్లు సర్వేంద్రియముల నంతర్ముఖ మొనర్చి చంద్రాద్యుపమాన శోభకు సహస్ర గుణంబులు హెచ్చునట్లు ప్రభావతీ సౌందర్యమును భావించెను. భావనా బలమున ప్రభావతీరూపమే యాతనికి గన్పడియెను. అట్టి పు బుద్ధి కగవ్యములు లేవుగదా!

ఒకనాడు ప్రద్యుమ్నుడు ఏకాంతవర్తి యయి యిట్లు చింతించెను. 'నా కనుంగవ యట్టి కాంతను గాంచగల భాగ్యము నోచుకొనలేదు. అప్పరి యేరికిని జొరరాని దట ! శుచిముఖి హంసలు యొక్కటి యాశకల్గించుచున్నది. చూడ్కికి నన్నునె పోలువాని చిత్రమున జూచితి' నని కదా శుచిముఖి చెప్పినది. ఆయ్యో! ఇంత కట్టి యేమి ? సమాకృతు లెన్ని గలుగవు? ఆనాడు నన్ను పాపపుబజ్జ నోడిదిమెను. నట్టి దొరత నంపు నీటుకొగదు గదా! హంసి అనాదరము జూపితి నని యేమ చునేమో ! నిలువకయే పయన మయ్యెను. నేను మాన పిచ్చి మాటలాడకున్నను ప్రభావతితో నొత్తి పలుక నని యేమ

చున్నది. కాకున్న ప్రసంగ మేల తెచ్చెను? ఏమో! అద్భుత రమణీయమైన వస్తువును ప్రసంగము కలిగనేని వాచాలికులు తుదిముట్ట వర్ణింపరా? మాతండ్రియు, ఇంద్రుడను తమ్ము పంపినపని పనిపెట్టుకొని నాకు చెప్పుట చూడగా నచ్చట సురశత్రువును జంపుటకునన్ను బంపుబుద్ధులు బుట్టియుండవచ్చు నని తోచుచున్నది. అన్నియు నాలోచించిన నాసలే పెరుగు చున్నవి. ఆదిశక్తి స్వరూపము చూపుటకే నన్ను వ్రాసె నని తోచదు. అంతఃపురకన్యల కన్యాపురుష చిత్రములిత్తురా? మనః పరీక్షణమునకు కారాదా? కాదు కాదు ఈశ్వరి కృపతో నిచ్చినది. బాల వేడుకతో జూచినది.' అని గదా వింటిని. 'తనవృత్తి కానటుల నలువ చెప్పెనని రాయంచ పలికి నపుడు నా తెలివి యెచ్చట వెళ్లవారెనో. విభు డెవ్వడని యాసతిచ్చె నని యడుగ లేక పోతిని. చక్రాంగభామిని ఎన్నియో ప్రశ్నలు వేయుటకు వీలుగా ప్రసంగము నడపినది. మూగ నోము పట్టిననన్ను జూచి యితడిచ్ఛావిముఖు డని తలచి యుండు నేమో! అట్లయిన నింకెన్నడను దర్శన మీయదు. ఆసరోజ ముఖి పొంతకైన మఱి యొక పరిహాసాంగన యేమనో యేగదో. దైవతకార్యము కలుగు గాన తప్పకపోవును. అయిన నీ విచార మేల? సరస్వతి చేతిమీదుగా దిద్దిన మరాళవనిత నాయుల్లము కనకపోవునే? అప్రతిహత మనుమత మని తలచగ పోవునే? కని లేనన్నను నా సౌందర్య నిధిని చూడ హంస తప్పకపోవును. ఒక్కపరి యా సుందరిని చూచినవా రెవ్వరును తిరుగజూడ కుండరు.'

ఇట్లు చింతించి మనఃప్రవృత్తి మాధుర్యాకృతిపై కేంద్రీక రించెను. అంతట ముమ్మర మగు విరాళి పైకొన పొద్దు

గడపుట కుద్యానమున కేగెను. ఆతని కచ్చట గాంచినను
ప్రభావతియే కాన్పింప జొచ్చెను. ప్రభావతీ భ్రమవశమున
లతలత దప్పకుండ దిరిగెను. పరీక్షించి చూచిన నవి యవ
యవములుగాక చిగురాకులు, పూగుత్తులు, తేటిమొత్తములు
నయినవి. ప్రద్యుమ్ను డంత 'అయ్యో! నిర్వ్యాజ స్నేహము
చూపిన హంసాంగనతో మన సిచ్చి మాటాడని యీ కృత
ఘ్నునకు వనితపొందు లభ్యమగు నెట్లు?' అని వాపోయెను.
మఱల నింకొక్కసారి రాయంచముగువ నా కన్నుల కరువు
దీర్చిన ధన్యుడ నయ్యెద నని తలపోసెను. వినుకలిచేత నేనే
యిట్లయితిని. చిరకాల సంవర్ధనమున నా పల్లవాధర యెట్ల
య్యెనో! హంసి నా తీరు తెలిసిన నిరాశాతప్తయై యేమ
య్యెనో! ఏమి సేయుదు? సురకార్యముపై హంసి యచ్చటను
వచ్చు నెప్పుడో కదా! కావున ముందుగ పత్రిక నంపెదను.
ఇట్లు తలచి తత్క్షణము లేఖ వ్రాసెను. వ్రాసి దీనిని గొంపో
వా రెవ్వరు! ఉత్తరము చనువారి నెల్ల ప్రార్థించెను. 'కోకి
లములార! మీరు వజ్రపురికి పోదురా? భ్రమరములారా!
మీరు పోదురా? చలువ లొసగెడు మేఘరాజములారా! మీ
రా పురివైపు పయనింపరా? యని కనపడిన వాని నన్నింటి
నడిగెను. అట్టియెడ నొక శుకము అభ్రమార్గమున జనుచు
నీతని దీనాలాపములు విని కరుణతో 'నేను వజ్రపురికి పోవు
చుంటిని. నీ కేమి కావలెనో ఒండు రెండు పల్కులతో
వచింపు'మని పలికెను. అంత ప్రద్యుమ్నుడు 'ఓపక్షిరాజమా!
ఆ నగరమున శుచిముఖి యను హంసి యుండును. ఆ మగువ
కీ పత్రిక నీయవలయును. ఇది నా ప్రార్థన' యని పలుక కీరము
అట్లే చేసెదను. 'నిలువ వీలులేదు. నా ఱెక్కల నడుమ ఎవ్వ

రికి గనబడకుండునట్లు పత్రిక కట్టుము’ అని వచింప వేగము యాత డట్లు చేసినంత కీరము విను వీధిని వజ్రపురము చేర బోయెను.

# ప్రభావతి

ప్రభావతి యొక్క నాడు ప్రాణసఖి రాగవల్లరితో గలిసి ఉద్యానవన విహారమున కేతెంచెను. ఆమె యవ యన సౌందర్యము కాంతి విశేషము వనశారు వీధికి వింత చెలువు గూర్చెను. రజోమాలిన్యము కప్పు తిప్పలుగ నున్న వృక్ష జాలము కృతఘ్నతతో నామె యార్తిని బెంచినవి. ఉద్యాన వనము చేసిన దాడికి నా కుసుమ కోమలికి గుండె దిగులు పుట్టెను అపుడామె ప్రాణసఖితో ‘రాగవల్లరీ! ఇంక పొద్దు పుచ్చు టెట్లు? వనాంత కేళనము చాలు నీ పాటికి. ప్రాణప్రియు చిత్ర వీక్షణమున నైన కొంతకాలము గడచు నేమో! తెవే యాచిత్రమని పలుకుటయె తడవుగ రాగవల్లరి బిరాన పోయి యెవ్వరు నెఱుంగకుండ నా చిత్ర ఫలకము గొని తెచ్చెను. చిత్ర ఫలక వీక్షణమున ననేక భావము లుప్పతిల్ల నా సరస హృదయ ప్రభావతి ‘చాలీ! ఎంతసును నీ చిత్రము తృప్తిగొలుపదేమే? చూచిన కొలదియు నొకవింత యింపు గాటముగ నెరపు చున్నది.’ లోకమున నిట్టి చెలువు డెచ్చట నుండును? ఉన్న నుబ్బకుండు నా? కలడని నన్నిట్లు బాధించుట భవానికి తగునటే’ యని నిర్విణ్ణమేషయై పలుకు చుండెను.

కన్యకా శుద్ధాంత బరిసరముల కేళాకూళుల బొడ్డన బావుల విహరించుచు, ప్రభావతితో చెలిమికై నిరీక్షించు

చున్న మరాళాంగన యా పల్కులు విని విని యిదియు తగిన యదనని తలచెను. తలచి యా మగువ యెదుట నడ్డముగా నల్ల నల్లన యరుగుచు మరలి మరలి చిత్రఫలకమును వీక్షిం చుచు నడయాడ జొచ్చెను. అపుడు ప్రభావతి 'రాగవల్లరీ ! ఈ కలుదులు పులుగు తా నే మెరుగునో? ఈ చిత్రఫలకమున జూపులు పఱపు చున్నది' యని పల్క నంత మరాళి 'ఓ కోమలీ ! మా యట్టి తిర్యగ్జంతువు లేమియు నెఱుగ కుండుట యదార్థము. ఐనను ఈ చిత్రము మరలి మరలి చూచుట కొక్క కారణము గలదు నే నొక దివ్యసమయ మున నొక సుందరాకారు భాగ్యవశమున జూడగంటిని. ఎంత యత్నించియు నట్టివాని నింకొక్కని లోకత్రయమున గాంచ కుంటిని. ఇపు డీ చిత్రము నాకు వేడుక గూర్చినది. ఇందలి వాడు వేఱొక్కడా ? యతని రూపె యెఱిగి వ్రాసిరా ? యను సందియమున నిట్లు వీక్షించితిని' యని మృదుమధుర స్వరంబున మనోజ్ఞముగ బలికెను. శ్రోత్రపేయ మగు నాపలు కులు విని ప్రభావతీ రాగవల్లరులు 'ఏమేమీ ? మఱియొక మాటు పల్కుము. నీవు గన్న సుందరునికి 'నీ చిత్రమున నున్న వానికిని భేదమేమైన గలదేమో పరివీక్షింపుము. భయ పడకుము. నీ వచస్సామర్థ్య మెంతేని కొనియాడుదుమ' ని యౌత్సుక్య ముట్టిపడ బల్కిరి. అంత నా పులుగు మగువ 'భయావహుల గుర్తింపగలను. ఇర్వురేకతమున నుండ వీలు వక పోరాదు గదా యని యుంటి న'ని పల్క నా చెలు లిర్వురు వెఱగంది, యా పులుగు కలికి పలుకులకు తమ హృదయ మర్పించి' ఓ పక్షికుల భూషణమా ! మా సంది యము తీర్ప ప్రార్థించు చున్నాము. ప్రార్థన త్రోసి పుచ్చక

వచ్చి వీక్షించి నీవు కనినసుందరు డితడవునో కాదో వేగి రంబ చెప్పుము. మే మిద్దరము కలదు లేదని పందెములు వేసికొంటి' మని పల్కిరి. 'పందెము లయిన నేమ ? మఱి యింకొక్క టయిన నేమి? మాకు తెలియబని లేదు. చూచి చెప్పదగినది వినిపింతును' అని యా మరాళాంగన ప్రభావతీ రాగవల్లరులు దీని వాక్య మెంతదూరము పోవుచున్న దని యొండొరులు వీక్షించుచుండ కొంత చేరువను కరిగెను. అరిగి సవిమర్శనముగ పలుమరు వీక్షించి తల యోర చేసి కొంత చింతించి ఔనౌను. ఇది యాతని రూపము. సందియము లేదు' అని పల్కి వారిహృదయమును నానందమున నోలలాడించెను. రాగవల్లరి ప్రమోదభరము పుక్కిలింతలై ముద్దు, గారవము చిగురొత్తి సఖాగ్రముల చెక్కలు దువ్వుచు నవ్వులుగు నొత్తుకొనిపోయి ప్రభావతి దండ నునిచెను. ఉనిచి 'ఓ హంస రాజమా! నన్ను రక్షింప వచ్చిన భాగ్యదేవతవు. ఇట్టి మనో హరాంగు డెందును లే డని యీ బేల మాటిమాటికి పంతము పట్టును. నన్ను గెల్పించితివి. నీకు జోహారులు' అని పలికినది. అప్పుడు ప్రభావతి 'ఇంత మాత్రముననే వేగిరింత యేలనే ? అతని లక్షణము లితని యందు నే మైన గల వేమో తలప వలదా' యని పల్కిన నా హంసి చిత్రము నీక్షించి 'అట్లడి గెద రేల ? అవిగో శంబరుని పరిమార్చు నాటి ప్రహారకిరణ ములు. అవిగో రతికంకణాలకములు గళమున నచ్చు గుద్దిన ట్లున్నవి. అహా ! రూపము వీర శృంగారకళాఢ్యమై యొప్పా రుచున్నది. ఎవరో యెఱిగియె వ్రాసి యుండిరి. ఈతని నామజాత్యాదులు నెఱుంగుదును. ఎవ్వ రెంత మన సిచ్చి వచింతురో అంత మాత్రమ ప్రతిభాషణ మీయ దగును.

గాన వచించెను. మీ పందెము తేలుటకదా మీకు గావల
సినది. నే జెప్పినది దానికి జాలును. మీ చెలువారు రాగవల్లరీ
ప్రభావతు లని మీ సంభాషణమున తెలియనచ్చినది. నన్ను
మఱచెదరు సుడీ' యని పల్కి గగనభాగమున కెగురబోయి
నది. ప్రభావతి యప్పుడు విషయము గదుర తన రెండుచేతుల
గట్టిగ పట్టుకొని 'ఓ మరాళతిలకమా! నీ రెక్కలు పున్నమ
నాటి వెన్నెలలు కాచియున్నవి. రెక్కలలోని బంగరు రేఖలు
క్రొక్కారు మెఱుగుల నవహసించుచున్నవి. స్వరమాధుర్యము
నిరుపమానము. ఇట్టి తీరులు గల నీ సాంగత్యము నెట్లు
జాఱవిడుతును? నా ప్రార్థన నాదరించి నన్నను గ్రహింపుము.
నాదు చెలిమి మన్నింపుమని ప్రార్థించెను. అంత మరాళము
'ఎంత వర్ణించితివి. మీ రహస్య విచారములకు విఘ్న మను
తలపు గలిగెనా నా యొప్పను గిప్పను నెచట నుండునో!
నన్ను నిర్బంధము చేయకుము. మంచినంపుము యేమునాడ'ని
వచించెను. 'ఓ అంచలతల్లీ! మా యేకాంతపు పని నీవు లేక
సమకూరు టెట్లు? నీ పలుకులు మా రహస్య మెఱుగుట
సూచించు చున్నవి. అయినను శుద్ధాంత కాంతలము గాన
మేము చెప్పజాల కుంటిమి. చెప్పకున్న పనికని నీవు పూను
కొనునట్లు లేదు. ఇంక చాటుమాట లేల? ఖరిని జోకొట్టు
జెల్లునా? ఈ సుందరుడు మా సుందరి హృదయము గట్టిగ
గలచినాడు. అతని వృత్తాంతము సర్వము విని పింపుము.
విని పింపకుంటివా మా చెలిప్రాణము లేమగునో' యని రాగ
వల్లరి ప్రార్థించెను. అంత శుచిముఖ యిట్లు పల్కెను. 'భరత
వర్షమున ద్వారక యను నగర రాజ మొండు కలదు. దాని
నెంత సంతృప్తిమైన వర్ణింపజాలము. మహామహుడు శ్రీకృష్ణుడు

అష్టమహిషీ సహితుడై యీనగరమున నివసించి యుండును. అందగ్రగణ్య రుక్మిణి. ప్రద్యుమ్ను డామె ముద్దుకొమరుడు. ఇది యాతని రూపము. ఆతని శౌర్యము, భుజబలము, గాంభీర్యాది సద్గుణములు వర్ణనమున కందనివి. సౌందర్యము మీర మెరుగుదురు.' ఈ పలుకులకు రాగవల్లరి డెందమున నుబ్బి "వయస్యా! ఈ పలుకుల నీ యలుక దీఱెనుగదా! దీని వాక్చాతుర్యము చూడ కడమకార్యము సాధించు దిట్టతనము కానిపించుచున్నది." యని పలికి, మరాళాంగనా చరణమున గల నూపురము వీక్షించి, బిరుదాక్షరముల చదువుకొని యబ్బురమున మునిగెను. తమ వృత్తాంతము చెప్పక తమ కొదవలు తీర వని తలచెను. ప్రభావతితో నాలోచించి యంచముద్దియకు తొలినుండి తుదిదాక తమ వృత్తాంతము వినిపించి "ఓ విహంగమపురంధ్రీ! ఇంక నీచేతనున్న దీయింతి బ్రతుక"ని పల్కి యింకను నిట్లనెను. 'ఈమన్మథగాథలు తల్లికి నక్క చెలియండ్రకుగూడ దాచు రహస్యములు. వీని విను భాగ్యము గల్గిన ప్రాణసఖులు ప్రాణము లర్పించియైనను ఋణము తీర్చుకొనగలరా? నీ వెఱుగని ధర్మము లేదు. సఖ్యము సాప్తపదీన మనిగదా విద్వజ్జనులు పల్కుదురు. నీవు నగముగ ద్వారక కరిగి యదునందనున కీ యతివసౌందర్యాదులు హృదయంగమముగ వర్ణించి యీ సుందరికోర్కె తీర్పవలయును' ఇట్లు రాగవల్లరి వయస్యకై ప్రార్థించిన హంసరమణి లేటతెల్లమగు పల్కుల నిట్లనెను. "నేనీ కొలకుల విహరించుచు పూర్వ మొక నాడీ యబల సౌందర్యముల కబ్బురపడితిని. స్వేచ్ఛావిహారముల నలరుచు నశ్వగతుల గ్రహించు పక్షిపుంగవకుమారుం గని యీ యాకృతిశోభకు

నా విలాసవతి యాకృతి శోభయొజోడని తలచితిని. ఆకుమారుని దర్శించి ప్రసక్తివెంట నీవిలాసము వర్ణించితిని. ఆతడు బాగా దవ కుండెను, (విన్నమగు ప్రభావతి మోముగాంచి) అతివా! కార్య మింతనె ముగసెనా? చింతిలనేల ? నీ సౌందర్యము వర్ణించునపుడు ఆత డేమియు పల్కకుండుటచే నాతని దత్తునని పంత మాడలేను. సిద్ధగంధర్వాదులతో నెవ్వని గోరినను తత్క్షణము కొని వచ్చెదను. నీ పితరుల గోరిన భవాని కోపించు నని భయము వలదు. ఆమె భక్తపరతంత్రి గదా! సందిగ్ధ ఫలమగు ప్రద్యుమ్నవాంఛ విడువుము. నీ యసమానసౌందర్యమువిని అపాస్తధైర్యుడుకాని వాడెవ్వడు? నేను భువన సంచారిణిని గాన దృగ్గోచరు లగు సుందరుల చిత్రముల దెమ్మనిన దెచ్చెదను. నీ యిచ్చకు వచ్చినవానిని వరింపవచ్చును. సఖి నా మాట వినుము."

ఈపల్కులు చెవులకు ములుకులై సోక ప్రభావతి 'హంసీ! సరసత్వమున మిక్కిలి ప్రౌఢ వని నమ్మితిని, గాని యిట్టివిరసవచనముల నన్ను వేధింతువని తలపలేను. నామనము అట్టినీచవృత్తికి నొడబడదు. నాప్రారబ్ధమెట్లున్న నట్లగుగాక. ఇంత ప్రౌఢ వయ్యును నాహృదయము లోతెరుంగ నైతివి. నా ప్రతిజ్ఞ వినుము. ఆ సుకుమార హృదయుడు ప్రద్యుమ్నుడు నన్నొల్లకున్న మన్మథాగ్నిలో తనువు వ్రేల్చి మరుసటిజన్మమున నాతనిసేవాభాగ్యము గాంతును. ఓ ప్రాణసఖి ! నిన్నొక తుది మాట యడిగెదను. నీహృదయము విప్పి చెప్పుము. కల్లలాడిన నామీదనొట్టుసుమీ! మరల నీ వొక పర్యాయ మాకుమారుని కలిసి మద్వాంఛాపరిపూర్తికి యత్నింపుము. అవ్వగాముల నిశ్చయించుము, ఇదియె నా ప్రాణరక్ష' ఈ దీన వాక్యములు

చంద్రాంగనా హృదయము కలంచెను. తడసిన ప్రాణసఖి నెక్కుడను భయము కలిగెను. దయయు ప్రేమయు మట్టిపడ 'ప్రాణసఖీ! ప్రభావతీ! నీ హృదయము బరీక్షింప గోరి యింతగాపల్కితిని. క్షమింపుము. నీ ప్రియుని వెంటబెట్టుకొని వత్తును. నీ సౌందర్య విభవ మెవ్వరికి విరాళి గూర్పదు? మీ యిద్దరి దాంపత్యమును దైవమే నిర్ణయించెను. మున్నొకపరి శారదా బ్రహ్మలకు ప్రణయ కలహమయ్యెను. నన్నపుడు నలువ పిలిపించి పొలతి పొలయలుక తీర్చి రమ్మని నియోగించి వేనుసికి చెప్పుమని కొన్ని పలుకులు చెప్పెను. అంత విరాళియగ్గమై 'ఓరీ! మన్మథా; నీపాట్లు నుండున్నవి లెమ్ము. ప్రభావతి యను సుందరిపై మరులుకొని విరాళి గూరెదవురా!' అని పుష్పశరుని నిందించెను. నేనంత 'దేవా రతిప్రియయు చిత్తము హరించు నా యతివ రూపలావణ్యాదులు రతివిలాసిని కెక్కుడా?' యని ప్రశ్నించితిని. అంత నా సృష్టికర్త "బాగు బాగు ఆ యిద్దరకు పోలికయే లేదు. రతి విలాసినికంటె నా విలాసిని రూపలావణ్యాదులు మూడు నాలుగు మడుంగు లెక్కువ. ఆ విలాసిని నా సృష్టికాదు. ఆదిశక్తి సంకల్పమాత్రమున సృష్టించెను" అని పల్కెను. కావున నీవు ధీరచిత్తవై యుండుము. ఆ మన్మథుడే కదా ప్రద్యుమ్నుడు.

## రహస్య భంగము.

ప్రభావతీ రాగవల్లరులును, శుచిముఖియును నుద్యానమున నేకాంతగోష్ఠి సలుపుచుండ, దండ నున్న వృక్షమున రెక్కలు టపటప గొట్టుకొనుచున్న కీరం బొండు వారికి

గోచరం బయ్యెను. ప్రభావతి భూతలమునా సత్వరతయున హంసియు రాగవల్లరియు ననుసరించిరాగా సంభ్రమమున జని మెలపున నురి వదల్చినంత, నా కీరము కేల్విడిపించుకొని మింటి కెగసెను. శుకము ఆవ్వన పైకెగయు నపుడు కొక్కాల నుండిజాఱిపత్రిక యొకటి క్రిందపడెను. సంభ్రమాశ్చర్యములు పెనగొన ప్రభావతి యుత్తర మందుకొని 'హంసీ! చూచితివా చోద్యము ? ఈ పత్రిక యెవ్వరి కెవ్వ రంపిరోగదా ! నీ వా కీరమును పట్టి దేగలవా?' యని పల్కెను. 'ఈ శుకము చిక్కపడ కెంత దూరము పఱచెను. ఇదె కూడముట్టి తెత్తునంచు నరా శము ఆకాశమునకు కుప్పించి యెగసెను. 'సఖీ! మన మిక్క డనే యుంటిమిగదా! ఈ యురు లెవ్వ రొడ్డిరే? ఇది యెంత చోద్యము ? అని ప్రభావతి పలుక 'నిన్ను బాధించిన పక్షుల బంధించుటకు నేనే యీ యురి పన్నితిని. క్షమింపు మని రాగ వల్లరి సఖిని వేడుకొనెను. దాని కేమి ? ఈ పత్రము చదువు మని ప్రభావతి పత్రిక యీయ రాగవతి యిట్లు చదివెను.

"సీ॥ శ్రీమత్సరస్వతీ రామాకృపా సంప్ర
యుక్తోపమాతి శయోక్తి కామ
ధేను సద్బిరుదాంక దివ్యమంజీర సం
శోభితపాదకు శుచిముఖికిని
బ్రద్యుమ్ను డూర్జిత ప్రణయ పూర్వకముగా
ననిపినయట్టి రహస్యలేఖ
ప్రప్రభాభావతిః బలుదెరంగుల నీవు
వచియింప" (సూరన)

ఇట్లు చదివి సంతసము నాపజాలక! చంకలు కొట్టుచు నొక్కగంతు వైచి, అక్కా నిన్ను గూర్చి కాంతు డంపిన

పత్రిక 'గదమ్మ" యని వింతగ మొగ మోరజేసి పల్కెను. అంత కనుదోయి విప్పార, ప్రభావతి "ఏదీ! పత్రికలో నట్లు యుండెనా? నను నుడికించుచుంటివా? నను జూడనిమ్ము" అని పత్రము చేయి చాచి యందుకొనబోవ, రాగవల్లరి దూర దూరముగ పరుగెత్తుచు దేవుని పై గానగ నంతయు జదువు చుంటిని.

సీ. "ప్రియ ప్రభావతీ! బలు తెఱంగుల నీవు
వచియింప నపుడు నిర్వచనవృత్తి
నే నున్కి కల్లగుట్టింతయె కాని యీ
యింతి యంగము లెవ్వి యెల్లు చెప్పి
తవి యెల్ల నట్ల నా యాత్మఁ దద్దయుఁ బడి
యచ్చున నద్దిన ట్లమర నంటి
మలిచినగతిని మిక్కిలి దృఢత్వముఁ జెంది
స్వగుణ సంపద్గౌరవమున నేమొ
యూఁది బడలించుచున్నవి యోమరాళి
... తేర్చు మని వేడు మామృగాక్షి"

(సూరన)

ఇంత చదువునప్పటికి ప్రభావతి యేమరించి పత్రిక గొబ్బున లాగుకొనెను. రాగవల్లరి పెనగక పత్రిక వదలి "ఇంక పైన మేము జదువ వలసినది కాదు. పచ్చిగ వ్రాసినాడమ్మా! ఇపుడు దాచి యావల జదువుకొనుమ"ని పలికెను. ప్రభావతి కోపలజ్జాలోలయై పత్రిక నలిపివేయం బోయిన రాగవల్లరి పెక్కు నలిశుచు "సఖీ! నీ కిది తగదు. ఆ లేఖపై మన కేమి యధికారము కలదు? మనకు ప్రాణసఖియై జీవమునిల్ప కంకణము గట్టుకొనిన హంసాంగనకు ద్రోహము తలప దగునా?

నీ తెలివి యేమూలదాచిబెట్టితి? ప్రియుడంపిన లేఖను కులదేవత వలె పూజింతురా? నలిపివేయుదురా? ఈపోకడమాలిన తనము పోకడబెట్టుము." అని బోధించి యా యత్నము మాన్పెను.

ప్రభావతి పంపున కీరమును కూడముట్టిన మరాళాంగన ఇంచుకదవ్వున శుకరాజమును పదముల నాక్రమించి అదియెంత గింజుకొనినను వెడలనీక 'ఎక్కడెక్కడి లేఖ యెక్కడెక్కడికి నడపుచున్నావు. అదె రక్కసులజేసి బిడ్డ నిన్ను దెచ్చుదాక కదలదు. వినగక రమ్మ'ని కీరమును హెచ్చరించెను. 'నన్ను జపించిన జంపుము. నన్నచ్చటికి గొంపోకుండిన పదివేలు. గొంపోయిన నెందఱు చచ్చెదరో' యని కీరము పలుక 'నిన్ను గొంపోయినను విడిచినను నొక్కటియ. లేఖ చేతిక్కినది. కావున ఊడిగిల బడకుము. ప్రభావతితో జెప్పి నిన్ను విడిపింతున'ని మరాళము పల్కెను. అంత నా శుకము 'చలమేల ? నీవడిగిన నా రహస్యము చెప్పెదను. పవిత్రను చూడుము. నా రహస్యము వినినపిదప నీ వెట్లు పంచిన నట్లు చేయుడు' అని పలికిన హంస కీరమును వెంటనిడుకొని లీలా మహీధర శిఖరముపై జేరెను. అంత శుకము హంసతో ప్రద్యుమ్న వృత్తాంతము సర్వము వినిపించెను. ఇది తనకార్యమె యగుటకు హంసాంగన సంతసము పొందెను. పత్రికా ప్రసంగము నిస్సారమని మరపించుటకై హంసి చిలుకను 'పక్షిపేర పత్రిక వ్రాసినవాడు పట్టి భ్రాంతుడగుట నిశ్చయము. అది యటుండ నిమ్మ. నీ వాపురి కేల బోతివి?' అని యడిగెను చిలుక చెప్ప రాక నీళ్ళు నమలినది. హంసి బిగియబట్టి యడిగినది. శుకము చావనైన నంగీకరించెను గాని చెప్ప దలపలేదు. రహస్యము దాతునని మాట యిచ్చిన చెప్పను ననియెను.

మరాళము మాటయిచ్చెను. శుకమిటుపలికెను. "సునాభుడు వజ్రనాభుని సోదరుడు. అతని పుత్రికలు చంద్రవతియు గుణవతియు ననువారలు. ఒకనాడు విహారవశమున నేతెంచిన నారదునకు నాయతివ లిర్వురును మ్రొక్కిలిడిరి. ఆతడు పతిమనోవల్లభలై పుత్రవతులు కండని యాశీర్వదించెను. దాదులు ఓ మునివర్య! వీరి విభు లెవ్వరని యడుగ నాతడు కొంత చింతించి 'యదువంశజులగు గదసాంబులు ఈ యమల విభులని పల్కెను. ఆ ముద్దియ లిద్దరు ముగ్ధలై నేడు విరాళి గుందుచున్నారు. వారు నన్ను ప్రాణముగ నెంతురు గావున కార్యసాఫల్యమునకై ద్వారక కేగితిని. నా రెంత వంత బొందుచుందురో, పోవలయును" ఇట్లు చిలుక పలుక నేనును నీతోడన వచ్చెద పదమని చిలుకతో హంస యా మగువల శుద్ధాంతమున కేగినది. వారు హంసను జూచి వెల వెల బాటునొంద చిలుక 'భయపడకుడు ఈ హంసి 'నిను నంపిన వారికి నీకును హితమే యొనర్తును. ప్రాతికూల్య మొనర్పను' అని మాట యిచ్చినది. ఏను మీ దాసనగుట మీచేత ననిపించుకొని నన్ను విడిచి పోవుటకు వచ్చిన' దని పలుక మరాళ మా కీరమును వదలెను. నిర్బంధ విముక్తమగు కీరము "మీ ప్రియులు సుఖులై యున్నారు. వారు ఏయుపాయమున నైన ఈ పురి ప్రవేశింతుమనిరి. తాళలేక మీరు సాహస మొనర్చిన తమ బ్రతుకులు సున్నయనిరి." అని పర్యవసానము విన్నవించెను. వారును చెవులు మూసికొని "ఎంతమాటాడిరి? ఎంతతాల్మినైన జూపక ప్రాణేశులట్ల నపచార మొనర్తుమా" యని పల్కిరి. చక్రవాకాంగన మీ ప్రియులరాకకు ఏ నుపాయము గావించెద. నన్ను మఱువకుండ'ని పల్కి ప్రభావతి యొద్ద కేగి నీపతి నీకై లేఖ

సంపె నని విని సంతోషముప దొప్పదోగి యా పులుంగును విడిచి పైచితిని. ఆపత్రిక యొరులకు చిక్కకుంటట పదివేలు. ఆచిలుక యేమైన మనకేమి? పత్రికార్థమేమి?" యని ప్రశ్నింప రాగవల్లరి తాను కనినంత చెప్పి పైవిషయము "నానను చదువతగినది కాదు. ప్రభావతి యనుటకు ప్రపభాభావతి యని వ్రాయు భ్రాంతిడేమి వారియను?" అని సచించెను. హంస యాశ్చర్యచకితయై "అప్పాను ఉలుకక పలుకక నేడెల్లు చేసెను. ప్రభావతీ సౌందర్యము విని విరాళి పుందసంమటు కాతనియాత్మ పాషాణమా? వజ్రమా? ప్రభావతి సంకల్పసిన్న గదే, సఖీ! ప్రభావతీ! ఆకడే పుర ప్రవేశ మొనర్పుటకు ఉపాయము నరసితిని. నీతండ్రి వజ్రనాభుడు నన్ను నాన సముఖమునకు తానై పిలిపించునట్లు చేయుట నీవంతు. అపలి కార్యము నేను చక్క బెట్టెదను." అని పల్కి వానిలచే సని పించుకొని నిజేచ్ఛం జనియెను. ప్రభావతియు రాగవల్లరితో కార్యనిమగ్న చిత్తయై గృహంబున కరిగెను.

# ప్రవేశము

వజ్రనాభు డొకనాడు కొలువుపీడి రాణివాసమునకాడెడి పాడెడి పువ్వుబోండ్ల సేవల గైకొనుచు రత్నాసనమున నుండి వాత్సల్యము మీరమీఱ తనముద్దు పుత్రికను లాలించుచు సంభాషించు చుండెను. ఆసమయమున పరంగము తెచ్చి ప్రభావతి సవినయముగ నిట్లు పలికెను. 'నాన సరోవరము శుచిముఖి యను మరాళాంగన సంచార మొనర్పు చుండును. దాని వాక్చాతుర్య మవర్ణనీయము. సత్కథారచనకు పెట్టినదిపేరు. చతురత దానిసొమ్ము. నీతి నిపుణ. కని విన్నగాని తనపతిం దు.

'వజ్రనాభు డీముద్దు పలుకులు ముద్దు సేయుచు నట్లు పిలిపింతు నని శుచిముఖి నప్పుడు పిలిపించెను. శుచిముఖి తనశాస్త్రవైదు ష్యము, కావ్యనాటకాలంకారగాన మదనశాస్త్ర పరిచయము కోకొల్లలుగ జూపెను. వజ్రనాభు డావచన రచనకు 'విస్తుపోయి నీవు గనిన వింత లెవ్వియయిన పలుకు' మనెను. శుచిముఖి యించుక విచారించినట్లు నటించి 'విశేషములు చాల కలవు. అం దొకటి మిక్కిలి విచిత్ర'మ'ని పలికి భద్రనటుని వృత్తాంతము విన్నవించెను. అంతవజ్రనాభుడు వేడుకను లోగి'యాతని గొనివచ్చుట నీభార మ'ని హంసకు పలికెను. హంస ప్రభావతిని గనుగొని యమ్మ! యనిపెదవే? యన ప్రభావతియు కొన్ని యడుగులు వెంటనంట 'వనరుహాక్షి! ఇది భవత్ప్రియార్థమే నన్ను మఱువకుండు' మని గూఢవృత్తి బల్కెను. ప్రభావతి వీడ్కోలుప ద్వారకకరిగి వనజనాభున కంతయు విన్నవించెను. విన్నవించియతని యాజ్ఞమేరకు స్వర్గమున కరుగుచు ప్రద్యుమ్ననింటి కరిగి మాటకు మాటగా ప్రభావతీ ప్రేమోదంతము సర్వము వినిపించెను. ప్రద్యుమ్నుడు తమకము ముమ్మర మయి ప్రేరేపగా 'ఓ ప్రాణప్రియ! ఱెక్కలు గట్టుకొని వ్రాలవలయునని యున్నది. ఏమిచేయను? మీవీడెవ్వరికి చొరరానిదట' యని పలికి చిత్తము కార్యమునకు త్రిప్ప 'ఓహంసాంగనా! అమర పతియు, హరియు తలపోయు కార్యమేమైన' దని యడిగెను. 'కుమారక! ఆచింత లుడుగుము. అన్నియు నేర్పాటైనవి' అని చెప్పి స్వర్గమున కరిగెను.

ఒకనాడు కృష్ణుడు ప్రద్యుమ్నుని, గద సాంబులను పిలిపించి కార్యస్థితి వివరించెను. అంత నతని యాజ్ఞచే ప్రద్యుమ్నుడు భద్రనటు డయ్యెను. గదుడు పారిపార్శ్వకుని యాకా

రము ధరించెను. సాంబుడు విదూషకు డయ్యెను. ముగ్గురును సెలవు గైకొని వజ్రపుర ప్రాంతముల తమయాటల పాటవను చూపుచు మెప్పుగొనుచుండ దనుజేంద్రు ద్వారస్థులు విని వారిని పిలిపించెను.

వారును వివిధసన్నాహ విశేషములతో నేగుదెంచిరి. శుచిముఖి యా వనితలకు వేఱువేఱ పతుల యాగమన మెఱిగించి వారల నౌత్సుక్యమున ముంచి యెత్తెను. ప్రద్యుమ్నుడు గదసాంబులతో గలిసి విచిత్ర సంగస్థల మేర్పరిచి తన మాయా చాతుర్య మేర్పడ ఆటపాటల చాతుర్య మనంతముగ జూపి సమయము నకుము గవాక్ష జాలకములనుండి తన్ను వీక్షించు ప్రేయసిపై చూపుడులు బఱపుచు గూఢ వృత్తిని వజ్రనాభుని స్తుతించెను. అంతలి గూఢార్థమును శుచిముఖి ప్రభావతి కెఱిగించి 'చెలీ! నీ ప్రియుడు నేటి రేయి నిన్ని ష్టాలాపముల నోలలాడించెద'నను చున్నాడని తెలియ జేసెను.

# సప్తమభాగము

ప్రద్యుమ్న కుమారుడు కన్యాకాంతః పురము చేరుట కెన్నియో యుపాయములు వీక్షించెను. ఎద్దియు సరిదాక దయ్యెను. అంత నానాటి మలిసంజవేళ నొకపరిచారిక ప్రభావతికి విరులు గొనిపోవుచుండుట చూచి తానొక తుమ్మెదయై యా కుసుమ జాలమున నిఱికి ప్రద్యుమ్ను డంతఃపురము జేరెను. అంతఃపురమున రాగవల్లరి ప్రభావతికి మజ్జనాదిక్రియ లాచరించి తడియార్చి ధూపవాసనల నలరార్చెను. వివిధ భూషణముల నామె నలంకరించి ఇచ్చవచ్చిన కలపములు కూర్చి మైపూతలు పూసెను. ఎన్నియో వలువలు మార్చి

మార్చి పరిశుద్ధపు సైకపుటాల్లె ధరింప జేసెను. మణిదర్పణము ముందు నిలిపి "బళీబళి! పుష్పవిలుతునినైన భ్రమింపజేయ జాలవే?" యని పొగడెను. ప్రభావతియు రాగవతి యొనర్చిన శృంగారమునకు మురిసెను. గృహాలంకరణ విధానముచూచి ముచ్చటపడెను. ప్రద్యుమ్నుడు అక్కడ నిక్కడ నేల నని ప్రభావతీ శ్రీపణకల్హారమున నణగియుండెను. ప్రభావతి ప్రియుని రాకకై ఎదురు చూచి చూచి విసిగి వేసారెను. శుచిముఖిరాగవల్లరులతో నిట్లనియెను. 'హృదయేశుడు రాడయ్యె నేలనే? విఘ్నము లేమి పుట్టెనో? నే డేతెంచు యత్నమున లే డేమో? రహస్యము వెల్లడి కాలేదుగదా! అంతఃపురములు దుర్గ్రాహములే. పెరవా రెట్లు చొరగలరు? మహాత్మ్యంబున మేటిగదా! రాదలచిన రా లేడటే! మగవారు నమ్మరాని వారట! అయిన నాయన నన నే మున్నది. ఇది నాదురదృష్టము. అబ్బా! ఈచంద్రు డగ్నిగోళమె. ఈ నాడు మలయానిలుడు తాపకారియయ్యెనే! సర్పవిషము తల కెక్కినదికాబోలు! రాజు ననుసరించెనో?" ఇట్లు పలికి ఎటాపిన నెటువచ్చునో యని తలచి మన్మథునకు కైమోడ్చి వినత్రయై "మీనకటునైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ" యని తడబడ బల్కుచు, నాలుక దడుపుచు పూబాన్పుపై బడబోవ ప్రద్యుమ్నుడు నిజరూపమున నా లతాంగిని బట్టుకొని పాన్పుపై బరుండబెట్టెను. అంత నా ప్రభావతి సేదదేరి సరసనున్న ప్రియుని గాంచి పతిచేతులు విడిపించుకొని లోనికి పారిపోయెను. అంత నాచెలు లిర్వురు మాసఖ చేసినతప్పు క్షమించుమని పల్కి 'ఓవరవర్ణినీ! సమాగమకాంక్ష ముమ్మరముగ నున్న ప్రియుడు త్వరపడుచుండ తడయుట తగదు

రారమ్మ' ని ప్రభావతిని పట్టుపట్టి తీసుకొని వచ్చి ప్రద్యుమ్ను నితో నిట్లనిరి. 'ఓ రాకుమారకా! పడతులచర్య లిట్టివి. నిన్ను దాక తమి నిల్పలేని యీ ముగుద ఎట్లు పెనంగునో వీక్షింపుము.' ఇట్లు పలికి తామె పెండ్లిపెద్దలై 'అయం ముహూర్తో సుముహూర్తోఽస్తు' అని గాంధర్వవిధి నడపిరి.

ప్రద్యుమ్నుడా లేమతో నా రేయి స్వేచ్ఛావిహారంబుల గడపి కార్యాంతరచింత చిత్తమున బొడమిన యంతనే యిట్లు పలికెను. 'ప్రేయసీ! ఇదిమొదలు మాపులెల్ల నిచ్చటగడపెద రేపులు మావిడిదయం దుండెద. రహస్యము వెలివోయిన మన మనోరథము మొదలంట కూలును. ఇచ్చటనుండి నా నివాసము వఱకు భూవివరము కల్పించుకొని పోయెద. ఇది మన రహస్యక్రీడకు ఉచిత మగు మార్గము. ఎవ్వరునెఱుగకుండ ద్వారము సంవరణము గావింపుము.' ఇట్లు పల్కి ప్రద్యుమ్నుడు చనినవెంటనే ప్రభావతి యాబిలము తగుతెఱగున సంవృతము గావించెను.

శుచిముఖి రాగవల్లరు లరుదెంచి సంక్షుభిత మగు నామె యాకారము గాంచి పరిహాస గర్భముగా పలుకుచుండ నా ప్రభావతి లజ్జయు రోషము పెనగొన వారిని అరచేతి చరపుల గారవించు చుండెను. ఇంతలో చంద్రవతీగుణవతులు ప్రభావతీదర్శన మనపేరు బెట్టుకొని హంసితో మాట్లాడుట కేతెంచిరి. ప్రియునిపై గల మమకారము వారి కట్టి పాటవము నేర్పినది. ప్రభావతీవేషము చూచి పురుష సంగతిగా నిశ్చయించి యా తరుణీమణులు "అక్కా! మేన పంతపసలు దోబూచులాడు చున్నవి. నిద్ర లేకుండుటను కనుఱెప్పలు చెప్పుచున్నవి. రేయి ఏదియో విశేషము కలిగినది. ఏ మాయిన

నేమి? జరిగినదానికి వగవ నేల ? ఇట్టి యంతఃపురమున నీమే లెట్లు గడించుకొంటివే?” యని పరిహాసములను జొచ్చిరి. ప్రభావతి యేమియు దోచక దిక్కులు చూచుచుండ 'వీరిగుట్టు బయలుసేయనిదె ప్రభావతి యుల్లము వికసింపదు. వారికిగూడ నది ప్రయోజనకారియే యగు నని తలచి యా శుచిముఖి “ఓ అక్కలారా! మీరు చదివిన ఉపాసననే యీ యక్కయు జదివినది. పెద్దదిగాన అక్క యభిమతము ముందు తీరినది. తొందరేల ? మీ యభిమతముకూడ నెరవేరును.” యని మర్మములుగాడ పలికెను. అంత నా ప్రభావతి” ఏట్టెట్టా పలుకుము. వీరల గుట్టులుగూడ నిట్టివిరౌ?” అని పల్కిన చంద్రావతీ గుణవతులు వలదని కనుసంజ్ఞల వారించుచున్నను వినక వారి చరిత మామూలాగ్రము మధుర వచనముల తెలియజెప్పెను. ప్రభావతి నవ్వుచు వారల వీక్షించి శిరము పుడుకుచు“ముని ముచ్చులారా! మీరు చేసినది దాచి నన్ను పరిహాసింప వచ్చితిరా ? ఇంక కట్టిపెట్టుడు. నా తోడి దొంగ లైతిరి ” అని ముద్దుగా బల్కెను. శుచిముఖి “అక్కా! అంతనె తీరలేదు. నేడు సిగ్గు మానె. జ్యేష్ఠవైన నీప్రియునితో జెప్పెముద్దు చెల్లెండ్రి ప్రియుల రప్పింపవలయున”ని పల్కి “అక్కలారా! సోదరీప్రియుడు దివ్యపురుషుడు. అతనిమహిమ మీ ప్రియుల జేరదెచ్చు”నని పల్కి వారి కొంగున ముడివేసి పోయిరం డని పంపినది.

శుచిముఖి ప్రద్యుమ్నుని నివాసమునకు పయనమైపోయి గదసాంబులతో ప్రద్యుమ్నుడు మంతనము లాడుచున్న సమయమునకు జేరెను. చేరి ఒండొరు లెరుంగకున్న వారిప్రేమ విధానముల నందఱికి నెరుకపరచి 'ప్రభావతి ప్రియా! నీవు

మాయావివి గాన ప్రేమసీ సమాగమ సౌఖ్యము పొందితివి. ఇష్టావాప్తికి తోడ్పనగానున్న వారికి తోడ్పనచూప వలదా ?' యని ప్రశ్నించి యాతనిచే నట్ల యని యనిపించుకొని యా ముగ్ధల జేరబోయెను.

ఆనాటనుండి ప్రద్యుమ్నుని కరుణచే గదసాంబులకు ప్రియాసమాగమ లాభము లభించెను. ఇట్లు బహుకాలము రహస్యభంగ మొదవకుండ ప్రేమా లాపములతో, సరస క్రీడలతో గడచిపోయెను. అమ్మువ్వురు మగువలు గర్భములు ధరించి నవమాసములు మోసి చంద్ర బింబముల వంటి మోములు గల పుత్రుల గనిరి. ప్రభావతి పుత్రునకు ప్రభా వంతు డనిపేరు పెట్టెను. ముగ్గురు పుత్రులు పుట్టిన తోడన నవయవ్వను లైరి. వారిని తండ్రులు వేద వేదాంగములను, ధనుర్వేదమును శిక్షించిరి. వారి పరాక్రమము, సురుచిరమగు నాకారము, అనవద్యమగు గుణజాలము వినయ గాంభీర్యాది సల్లక్షణములు తలిదండ్రుల కానందము గూర్చినవి.

## విజయము

ఒకనాటివేకువ వజ్రనాభుండు, సామంతులు, దండ నాధులు, నాప్తులు, భృత్యగణము సేవించియుండ నిండు కొలువు దీర్చి పేరోలగంబుండ కన్యాకాంతఃపుర రక్షణాధి కారులు మోముల భయంబు గదుర వినయ వినమిత కంధ రులై యిట్లు విన్నవించిరి. 'దైత్యకులాధిపా! భవదీయంబగు నాజ్ఞ శిరసావహించి పోతుటీగకైన దూరరాకుండ కన్య కాంతఃపురము నేమఱక రక్షించుచుంటిమి. మా దురదృష్టం బున నొప్పమి తటస్థించినది. మసుగు చీరవంటి తమకులమున మసి దాకినది. కటాక్ష వీక్షణములు మాపై ప్రసరించి మమ్ము

మన్నింపుము. దేవరచిత్తము.' ఈ వార్తకు వజ్రనాభుని క్రోధము మిన్నంటెను. కటంబు లదరెను. ఆగ్రహోదగ్రుడై సభాసదుల జూచి 'దానవ పుంగవులారా! వింటిరా యీ వార్త. మ్రుచ్చులిట్లు నా యింటికి ద్రోహము తలంచిరి. శేషనాగము కోరల వ్రేలిడి గోకుకొని జూచిన వీరెవ్వరైన నేమి? నాకెవ్వరైన స్వర్గమింక లేదు. భోగికులజులైన పాతాళము రూపుమాయును. మానవులైన ధరణికి మూడిన దన్న మాట. ఓ తలవరి పెద్దా! ప్రాణములతోడ నా పాపు బట్టి తెమ్ము. వారి లోకమును మారణహోమ మొనర్పుము. అంత నా భీమబలుడగు తలవరి సకల సన్నాహములతో దండెగి యెంతకు దిరిగిరాడయ్యె. సేనా నాయకులు, ప్రధాన సేనాధిపతి మూలబలముల గొనిపోయియు తిరుగు మొగము పట్టుచుండిరి. కోట కొమ్మల గట్టిన వారి తలలు వారిగతి నెఱిగించినవి.

వజ్రనాభుడు, మొగము ముడిపడుచుండ, యుద్ధమునకు పయనమయ్యెను. వాని వెంట తమ్ముడు సునాభుడును, మిత్రామాత్యవర్గంబులును, చతురంగ బలంబులును పయనమైనవి. వారిపదాఘాతములకు భూమిగడగడవడకెను. అకాలతిమిర ముప్పతిల్లెను. భేరీధ్వనులు దిక్కుల పిక్కటిల్లెను. వజ్రనాభుడిట్లు కదలివచ్చి కన్యాకాంతఃపురము ముట్టడించెను.

తమతమ విడుదులలో సరసగోష్ఠి విశేషంబుల నానందించుచున్న ప్రద్యుమ్నగదసాంబుల కీయుద్ధవార్త కర్ణాకర్ణికగ తెలిసెను. పసిపాప లీభయంకర యుద్ధమున కోర్వలేరని భయమున బిలద్వారమున నంతఃపురము చేరనరిగిరి. అచ్చట భయవశమున మూల దాగియున్న తమతమ యువిదల నక్కున జేర్చి

భయము తీర్చిరి. నెత్తుట జొత్తిల్లుచున్న కత్తుంతో వచ్చి మ్రొక్కిన వీరపుత్రుల నెత్తుకొని ముద్దాడిరి. అపుడు ప్రద్యుమ్నుడు ప్రభావతితో "మగువా! మీతండ్రి మిక్కిలి విక్రమించుటకు ఎత్తివాచ్చినాడు. మే మూరకున్న నింతట గర్వము తెగును. రణము లనిన పూలబంతుల విసరులాటలు కావు. ఏవాడు మడియునో ఎవ్వడెరుగు ? నీతండ్రియుద్ధతి చూచిన మరణముకగాని యది తీరునట్లు చూపట్టదు. నీవు చిత్తముచిన్న బుచ్చుకొన్న నే జూడజాలను. ఏమి చేయుదు? దరి గానని విచారమున మునిగితిని." అని పల్కెను. ప్రభావతి నిమేష మాత్ర మూహించి పితృవాత్సల్యము త్రెంచివేసినది. మూల నున్న యాతని పెనుగత్తి తెచ్చియిచ్చి దానవపతిని గెలువుము. తక్కిన యనుమానము మాను మ"ని ప్రియుని హెచ్చరించినది. ప్రియురాలి సాహసమునకు ఉత్సాహము పొంగిపొరలగా ప్రద్యుమ్నుడుగదసాంబులను ప్రియపుత్రులను అంతఃపురమునకు కావలిపెట్టి హుటాహుటిని అసిద్వితీయుడై కోట వెడలి సేన నుఱుమాడ జొచ్చెను. చుట్టుముట్టిన సైన్యమంతయు నాతనిధాటి తాళలేక విచ్చి పరుగెత్తెను.

సైన్యంబు భంగపాటు కోపంబు ప్రేరేప వజ్రనాభుడు ప్రద్యుమ్ను నెదిర్చి "ఎవ్వడవురా నీవు? ఈ వీడెట్లు చొచ్చితివి? దొంగ వరమిచ్చిన బ్రహ్మకు దేహశుద్ధి కావలయును. నీకొ ప్పుడు యడగించెదను. కాచుకొమ్ము" అని ధిక్కరించి పలికిన ప్రద్యుమ్నుడు పిన్ననవ్వు నగి యిట్లనియె "నేడు తిరిగి చనినగదా బ్రహ్మను శిక్షించుట. ఆమహామహుని జిహ్వకు అసత్యోక్తి కలదా ? ఇట్టి దార్జన్యములె మీకిట్టిపాట్లు తెచ్చుచున్నవి. భద్రినట వేషమున నీయనుజ్ఞ గొని యీపురి చొచ్చి

తిని. నా పేరు ప్రద్యుమ్నుడు నందనందనుని పుత్రుండను. నేను నీపుత్రికకు భర్తనైతిని, మావారలె నీసోదరుని తనూజలకు మగలైరి. ప్రాణముపై నాసగలదేని శ్రీకృష్ణుని, ఇంద్రుని శరణు వేడుము. కాకున్న నీ విక నుండవు.''

ఈ పల్కులు శూలములై తన్ను దాక వజ్రనాభుడు "నిన్నింతతడవు ఉపేక్షించి నందుల కేమైన పల్కెదవు.'' అని బాణపరంపర లతనిపై వర్షించెను. ప్రద్యుమ్నుడాబాణపరంపరల ఖండించుచు వజ్రనాభుని దరియ బోవుచుండ రాక్షస బలము లన్నియు నాతని జుట్టుముట్టినవి. పోరు ముమ్మర మయ్యెను. గదసాంబులు తడయరాదని తలచి కోటగనకులు తెలిపించి రాక్షససేనల నెదిరించిరి. రాయంచలు యుద్ధ వార్తలు శ్రీకృష్ణునికి విన్నవించినంత నాతడు గరుడవాహనము నెక్కి చక్రాద్యాయుధములు హస్తముల నలంకరింప యుద్ధ భూమి బ్రత్యక్ష మయ్యెను. ఇంద్రుడును ఐరావతము నధిష్టించి విచ్చేసెను. ఇంద్రునాజ్ఞచే సర్వపరికర సంపన్నములగు రథములు ప్రద్యుమ్న గదసాంబుల జేర నరిగినవి. వారలా యరదముల నధిష్టించి ఎల్లెడల తామై యుద్ధ మొనర్ప జొచ్చిరి. ప్రద్యుమ్నుడంగటి వదలి వజ్రనాభునితో తల పడెను. పోరు భరమగుట చూచి కృష్ణుడు ప్రద్యుమ్నుని చేతికి చక్రాయుధ మంపెను. ప్రద్యుమ్నుడానందాతిరేకమున దాని నందుకొని తత్ప్రయోగమున వజ్రనాభుని మూర్ధము ఖండించెను. అంతట పోరు తీరెను.

ఆకసమున దేవత లాడిరి. పుష్పవర్షము గురిసెను. వజ్రనాభుని మరణము లోక కల్యాణమునకు నాందియయ్యెను.

కృష్ణుని నమస్కరించిన మనుముల ముద్దాడి కోదండ్రి నాశీర్వదించెను. ఆతఁడు వజ్రనాభుని రాజ్యమును చతుర్భాగంబులుగా విభజించి మనుముల పట్టాభిషిక్తుల నొనర్చెను. కొడుకులను కోదండ్రిను వెంటనిడుకొని ద్వారక దరిగెను. ప్రభావతీ ప్రద్యుమ్నులు కృష్ణుని సేవించుచు అపారసౌఖ్యముల నోలలాడుచు వర్తించుచుండిరి.

సంపూర్ణము

---

## కఠిన పదములకు అర్థములు

| | | |
|---|---|---|
| వదాన్యత | = | దాతృత్వము |
| కళావేతృత్వము | = | కళలు తెలిసియుండుట |
| నిరవద్యము | = | దోషములేని |
| నిఖిల | = | సంపూర్ణమైన |
| మాతృక | = | దేవత |
| యోగము | = | ధ్యేయమునందు మనసు కేంద్రీకరించుట |
| శ్యాలకుడు | = | బావమరది |
| గర్భదాసి | = | పుట్టుదాసి |
| రండాపుత్రుడు | = | లంజకొడుకు |
| సంశయగ్రస్తము | = | అనుమానాస్పదము |
| సువర్ణభాండము | = | ఒకనగ |
| పరార్థ్యము | = | అమూల్యము |

| | | |
|---|---|---|
| పూఁట | = | జామీను |
| విలుచుకొనుట | = | కొనుట |
| అర్ధకేక్ష్యావర్తము | = | చలిది |
| తిర్యక్కులు | = | పక్షులు |
| పోకార్చు | = | నశింపజేయు |
| ఆలానము | = | కట్టుకొయ్య |
| గుబుల్కొను | = | వ్యాపించు |
| సౌప్తికవధము | = | నిద్రించువారిని చంపుట |
| ద్రౌణి | = | అశ్వత్థామ |
| జర్జరస్నాన శాటీనిబద్ధము | = | చినిగిన స్నానము చేయు గుడ్డను కట్టబడినది |
| ఏకలోష్టావశేషము | = | ఒక ఇటుకమిగిలినది |
| తుల్యావస్థ | = | సమానమగు దశ |
| భద్రపీఠపు పురుగు | = | ఆరుద్రపురుగు |
| అప్రతిగ్రాహకుడు | = | దానము పుచ్చుకొనని వాడు |
| న్యాసము | = | దాచపెట్టినది |
| డొల్లవోవు | = | మూర్ఛిల్లు |
| ప్రత్యామ్నాయము | = | బదులు |
| అల్లాడుట | = | తిరుగుట |
| ననలొత్తుట | = | తీగెలు వ్యాపించుట |
| వివిక్తము | = | నిర్జనప్రదేశము |
| నిష్క్రియము | = | వెల |
| అప్రకాశము | = | బయలుచేయరానిది |
| సేచకము | = | తడుపునది |

| | | |
|---|---|---|
| అనృణుడు | = | అప్పులేనివాడు |
| ప్రవహణము | = | బండి |
| విప్రస్వము | = | బ్రాహ్మణధనము |
| గోపాల దారకుడు | = | గొల్లపిల్లవాడు |
| అభిసరణము | = | ప్రియునికై ఆతని యింటికి యేగుట |
| ప్రకోష్ఠాష్టకము | = | యెనిమిదవ ప్రాకారము |
| అభియుక్తులు | = | తెలిసినవారు |
| శుష్కవృక్ష వాటిక | = | యెండినవృక్షములుగల తోట |
| కామనీయుడు | = | కోరతగినవాడు |
| ఉద్వృత్త దంష్ట్రి | = | పెరుకబడిన కోరలుగల |
| సుసజ్జ | = | బాగుగా అలంకరించుకొని నది |
| [illegible] | | కో[illegible] మనస్సుకల |

| | | |
|---|---|---|
| పలాశపాదపము | = | మోదుగ |
| అధికరణికుడు | = | న్యాయాధిపతి |
| చారచక్షువు | = | రాజు |
| కశాఘాతము | = | కొరడా దెబ్బ |
| శూలారోపణము | = | శూలముపై దిగవేయుట |
| ధర్మైకజీవిత | = | ధర్మమే ప్రధానమైన జీవితము కలది |
| సదస్సులు | = | సభలు |
| నివాపాంజలి | = | తర్పణము |
| అనౌశీరము | = | వట్టివేరు లేనిది |
| ఘోషణాస్థానము | = | చాటింపు తెలియచెప్పు చోటు |
| ప్రత్యయము | = | నమ్మకము |
| స్త్రీ ద్రవ్యాలు | = | |
| పృథివి దండపాలకావా | = | |

| | | |
|---|---|---|
| వెలార్చు | = | బయలుచేయు |
| అవభృతస్నానము | = | యజ్ఞాంతమున చేయు మంత్రపూత స్నానము |
| కోరకములు | = | మొగ్గలు |
| ధార్ష్ట్యము | = | దుడుసుతనము |
| ప్రముచ్చులు | = | దొంగలు |
| ముదల | = | ఆజ్ఞ |
| దీర్ఘికలు | = | దిగుడు బావులు |
| విశ్వాసయోగ్యము | = | నమ్మదగినది |
| వలిమం | = | హిమవంతము |
| అగజ | = | పార్వతి |
| మచ్చరీడు | = | మాత్సర్యము కలవాడు |
| వరట | = | హంస |
| [illegible] | = | [illegible] |
| సరూపాశ్వాలి | = | ఒకేరూపముగల గుఱ్ఱముల సమూహము |
| ఊదిపట్టుట | = | నొక్కిపట్టుట |
| యోగ్యసమర్పణ | = | తగిన కానుకనిచ్చుట |
| భీమరథరుడు | = | ఇంద్రుడు |
| శార్ఙ్గము | = | ధనువు |
| బింబఫలము | = | దొండపండు |
| నులి | = | చిక్కు |
| అంచలపిండు | = | హంసలసమూహము |
| అప్రతిషిద్ధము | = | నివారింపబడనిది |
| ఖేలనము | = | ఆట |

| | | |
|---|---|---|
| కలహంసము | = | హంస |
| ప్రహారకిణములు | = | అల్లె త్రాటి దెబ్బలవలన కట్టిన కంతులు |
| సాప్తపదీనము | = | ఏడు అడుగుల నడకకు చెందినది |
| అపాస్తధైర్యుడు | = | పోయిన ధైర్యముకలవాడు |
| నిర్వచనవృత్తి | = | మాట్లాడకుండుట |
| ఈడిగిలబడుట | = | లాగిననురాకుండ వ్రేలాడబడుట |
| పరిశుద్ధ సైకతపుటొల్లె | = | స్వచ్ఛమైన సన్నని నేలబల్లె |
| శ్రవణకల్హారము | = | చెవినిదాల్చు కలువ |
| ఆగ్రహోదగ్రుడు | = | కోపముచే మండిపడువాడు |
| అసిద్వితీయుడు | = | కత్తియే సహాయముగా కలవాడు |

ఆంధ్ర పవర్ ప్రెస్, తెనాలి. కా. 9500 ది 5-3-48 కో. కా. జి-16



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B105 |
| పుస్తకం పేరు | పుష్పాంజలి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B,D |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |